# విషయసూచిక

మొదటి పంచవర్ష ప్రణాళికాకాలానికి, సాముదాయక అభివృద్ధి కార్యక్రమ నిర్వహణలో అధికారరీత్యా పాల్గొటున్న వారిసంఖ్య ఎనభైనాలుగువేలను అందుకొంది. రెండవ పంచవర్ష ప్రణాళిక ముగిసేసరికి వీరిసంఖ్య 3 లక్షలదాకా ఉండవచ్చని అంచనా వేయబడింది. ఈ కార్యక్రమాన్ని కొనసాగించడానికి ఎంత విస్తృతమైన శిబ్బంది వ్యవస్థ అవసరమవుతుందో పై సంఖ్యలనుబట్టి ఊహించుకోవచ్చును. అడుగున గ్రామసేవకులనుండి అగ్రంలో ఢిల్లీలోని నిర్వాహకునిదాకా ఈ సిబ్బందిలో అనేక స్థాయిలున్నయ్.

సాముదాయక అభివృద్ధి కార్యక్రమం చాలావిస్తృతమయినది. గ్రామసీమల్లో నవజీవనం సృష్టించడానికిది ఉద్దేశింపబడింది. ఇంతటిఉద్యమం విజయవంతం కావాలంటే దాని నిర్వహణలో పాల్గొంటున్నవారి కందరికీ, ఉద్యమంయొక్క లక్ష్యాలేవిటో, దానిఅంశా లెటువంటివో, దాని విధానా లేరీతివో స్పష్టంగా తెలియచెప్పడం ఎంతైనా అవుసరం.

ఇతరచోట్ల అవలంబింపబడుతున్న విధానాలిందుకు పనికిరావు. పాఠశాలలో ఉపన్యాసాలతో శిక్షణ పూర్తికాదు. ముందుముందు శిక్షణపొందేవా రెటువంటి పరిస్థితులలో పనిచేయాలో, అటువంటి పరిస్థితుల్లోనే ఈశిక్షణగూడా జరగటం అవుసరం.

వ్యవసాయం, ఆరోగ్యం, విద్య, వంటిరంగాలలో ఏదైనా ఒక రంగంలో కార్యక్రమ నిర్వహణ బాధ్యత వహిస్తున్న నిపుణులకు ప్రత్యేకశిక్షణ వున్నది. దానితోపాటే, బహుళార్థ

సాధక కృషి చేయవలసిన గ్రామసేవకుల కుపయోగపడే శిక్షణ కూడా ఒకటున్నది. ఇందులో అనేకమయినఅంశాలు మిళితమంటు ఉంటాయి.

అతిముఖ్యమయిన యీ అవసరాన్ని తీర్చేందుకు అవలంబింపబడుతున్న శిక్షణ విధానం రెండువిధాలుగా వున్నది. మొదటిది అందుకనే నెలకొల్పబడిన సంస్థలలో లభిస్తుంది. రెండవరకమయిన శిక్షణ, అభ్యర్థి ఉద్యోగంలో చేరిన తరువాత ప్రారంభమవుతుంది. ఇది 'రిఫ్రెషర్ కోర్సుల' ద్వారా, పరిశోధనా పర్యటన (స్టడీటూర్స్) ల ద్వారా, గోష్టులద్వారా, ప్రదర్శనలద్వారా కొనసాగింప బడుతుంది. ఈ రెండవవిధానం, స్వభావానుగుణంగా 'ఇన్ సర్వీస్ ట్రెయినింగ్" (ఉద్యోగంలో శిక్షణ) అని వ్యవహరింపబడుతున్నది.

సాముదాయక అభివృద్ధి కార్యక్రమ నిర్వహణకు శిక్షణ అవిరామమైనదనే గ్రహణ, రంగంలో పనిచేస్తున్నంత కాలమూ, ఈ శిక్షణకూడా కొనసాగుతుందన్న గుర్తింపే ఈ విధానాన్ని రూపొందించాయి.

ఆంధ్రరాష్ట్రంలో యీ రోజున, జాతీయ విస్తరణ సేవా కేంద్రాలుగాని, సాముదాయక కేంద్రాలుగాని 55 ఉన్నయ్. రెండవ పంచవర్ష ప్రణాళిక సమాప్త మయ్యేసరికి, ఇవి రాష్ట్రమంతటా వ్యాపిస్తాయ్. అప్పుడు వాటిసంఖ్య 303 దాకా ఉంటుంది. ఒకజాతీయ విస్తరణ కేంద్రం క్రిందవున్న ప్రాంతంలో ఈ కార్యక్రమాన్ని కొనసాగించాలంటే పదిమంది గ్రామసేవకులు కావాలి. ఆ లెక్కన, రెండవ ప్రణాళికాంతానికి అవ

సరమయే గ్రామ సేవకుల సంఖ్య 2480 దాకా ఉండ వచ్చును.

శిబ్బందికి శిక్షణ మన రాష్ట్రంలో మొదటిసారిగా 1952 లో, సామర్లకోట విస్తరణ శిక్షణాలయంలో ప్రారంభమయింది. శిబ్బంది అవసరం ఎక్కువయినకొద్దీ, కొత్తసంస్థలను నెలకొల్పడం తప్పనిసరయింది. 1954 లో గోపన్న పాలెంలోను 1955 లో కాళహస్తిలోను రెండు విస్తరణ శిక్షణాలయాలు నెల కొల్పబడినవి. పెరిగిపోతున్న ఈ అవసరాన్ని తీర్చేందుకు, సామర్లకోటలోని శిక్షణాలయం, కాళహస్తిలోని శిక్షణాలయం రోజుకు రెండు షిఫ్టుల్లో పని ప్రారంభించాయి. ఇంతవరకు యీ మూడు సంస్థలలో 600 ల గ్రామ సేవకులు శిక్షణపొంది ఉద్యోగాలలో చేరారు. ఈ మూడుసంస్థలలో కల్లా సామర్లకోట లోని శిక్షణాలయం పెద్దది. అనేక విషయాలలో ఇక్కడ శిక్షణ కవకాశమున్నది. ఈ సంస్థలో గ్రామ సేవికలకు గృహనిర్వహణ శాస్త్రం నేర్పేందుకు వసతులున్నాయ్. గోపన్న పాలెంలో గ్రామీణపరిశ్రమల నమూనా కేంద్ర మొకటున్నది.

ఈ సంస్థలలో అవలంభింప బడుతున్న శిక్షణ విధానాల కేదయినా ప్రత్యేకత, విశిష్టతఉందా? ఉంటే అదియేమిటి? ఈ విధానాలకు వాటి స్వభావమే విశిష్టతను చేకూరుస్తోంది. ఈ విధానం పెక్కువిషయములమేటి కలయిక. వ్యవసాయం, పారిశుద్ధ్యంవంటి అతిసాధారణ విషయాలలో పాఠాలతోబాటే, సంస్కృతి, మానవత్వం, ఒక నూతనజీవిత సిద్ధాంతంకూడా విద్యార్థులకు నేర్పబడుతాయి. విస్తరణ విధానాలలో శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ విధానాన్ని అతడు ఆచరిస్తున్నప్పుడు, విచక్షణాయుతమయిన

నడవడిక, ఓరిమి, తనుచేస్తున్నపనిలో ఆనందం పొందగలగడం ఎంత అవసరమో కూడా స్పష్టం చేయబడుతుంది. ఈసాముదాయక అభివృద్ధి కార్యక్రమానికి ప్రాతిపదికయిన ప్రజాస్వామ్యం, ఈ శిక్షణ కేంద్రాలలో ప్రతిబింబిస్తుంటుంది.

ఈ శిక్షణ పొందిన విద్యార్థి ఎలా తయారవుతాడు ? శిక్షణాలయం బయటికిరాగానే గ్రామసీమలు వేయిగొంతుకలతో అతన్ని పిలుస్తయ్ ధైర్యంగాతలఎత్తి ముందుకు అడుగువేస్తాడు. తానుచేయవలసిన కృషి – నిర్మాణాత్మకకృషి, సృజనాత్మకకృషి– తనముందొక్కసారి ప్రత్యక్షమవుతుంది. అతనిహృదయం ఆనందంతో ఉప్పొంగుతుంది. అనేక విషయాలు నేర్చుకొన్నవాడతడురి మనసులో వేయిభావాలు మొలకలెత్తుతుంటాయ్. తానింతవరకు నేర్చుకొన్నదల్లా ఇప్పుడు ఉపయోగించుకోవాలి. గ్రామాలలో సేవచేయాలి. వాటిని మళ్లీ స్వర్గసీమలను చేయాలి. ఈ మనస్తత్వాన్ని సృష్టిస్తుందీశిక్షణ. పూర్వపు మన విధానాలకెంతో దూరమయిన ఈ నవీన విధానంవల్ల ఈ ఫలితం సాధ్యమయింది. స్వతంత్రోదయంవల్ల యీ శిక్షణే సాధ్యమయింది.

ఈ శిక్షణపొందే అనేక రకాల ఉద్యోగులలో అతిముఖ్యుడు గ్రామసేవకుడు. 'గ్రామసేవకుడు'– నిజంగా ఇది సార్థకనామం, ప్రజలు, ప్రభుత్వం గ్రామాల్లో ఇతనిద్వారా కలుసుకొంటారు. ఉద్యమంలో అతనిది కీలకస్థానం. అతను చేయవలసిన పనికి అతడు అన్నివిధాలా తగిఉండాలంటే మానవత్వపు విలువలన్నీ అతడాకళింపు చేసుకోవాలి. భారతదేశంలోని గ్రామాలనుద్ధరించడానికి ప్రతిజ్ఞబూనాలి.

ఈ మధ్యనే ఒక క్రొత్తరకమయిన శిక్షణ ప్రారంభమయింది. అది గ్రామనాయకులకు శిక్షణ. దీనికాలం మూడు నాలుగురోజులు మాత్రమే ఉంటుంది. అది ప్రత్యేకంగా శిబిరాలలో కొనసాగింపబడుతుంది. గ్రామస్థులనుండే యెన్నుకోబడిన స్త్రీ పురుషులకు ప్రత్యేకంగా ఈ శిబిరాలు నిర్వహింపబడ్డాయి. రాష్ట్రంలో ఈ శిబిరాలను నిర్వహించే నిమిత్తం రాష్ట్రస్థాయిలో ఒక దర్శకుడు నియమింపబడ్డారు. సాముదాయక అభివృద్ధి కార్యక్రమం ఈ రోజున రెండవదశలో ఉన్నట్లు చెప్పవచ్చును. 'ప్రజల సహకారంతో ప్రభుత్వ పథకం' నుండి 'ప్రభుత్వ సహాయంతో ప్రజల పథకంగా' పరిణామం జెందుతోంది. ఈ గ్రామనాయకుల శిక్షణ శిబిరాలను నిర్వహించడంలో ప్రధానోద్దేశం, ప్రజల దృక్పథంలో అవసరమయిన మార్పు తీసుకురావడం. ఈ మహత్తర బాధ్యతను ప్రజలే క్రమంగా స్వీకరించేటట్లు చేయడమే యీ శిబిరాల ముఖ్యోద్దేశం.

మన రాష్ట్రంలో మూడు విధాలశిక్షణ- శిక్షణాలయాలలోనిది, ఉద్యోగంలో శిక్షణ, గ్రామనాయకుల శిక్షణముందు విపులంగా వర్ణించబడినవి. ఇవిగాక, మన రాష్ట్రంలో యింకా మూడు శిక్షణాలయాలు, బాపట్లలోను నంద్యాలలోను, అనకాపల్లిలోను, ఉన్నయ్. వీట్లలో విస్తరణ కేంద్రాలకురాక పూర్వం గ్రామసేవకులు, వ్యవసాయంలోను, పశుసంవర్ధనలోను శిక్షణ పొందుతారు. ఈ కేంద్రాలలో శిక్షణకాలం పన్నెండు మాసములు. ఈ మూడు కేంద్రాలలో లభించే విజ్ఞానం; విస్తరణ శిక్షణాలయాలలోని విద్యకు పరిపూర్ణతనిస్తుంది. ఈ మూడు వ్యవసాయ శిక్షణకేంద్రాల కార్యకలాపాలను ఇందుతోబాటే ప్రచురితమవుతున్న మరొక పుస్తకంలో వివరించడయినది.

## 1. సామర్లకోట కేంద్రం.

1952 అక్టోబర్ 2 న మనదేశమంతటా, 55 కమ్యూనిటీ ప్రాజెక్టులు నెలకొల్పబడ్డాయి. వాటిలో రెండు ఆంధ్రరాష్ట్రంలో, కాకినాడ–పెద్దాపురం ప్రాంతంలోను, కర్నూలు, కడపకాలవ ప్రాంతంలోను వెలిశాయి. వీటితోపాటే, సాముదాయక అభివృద్ధి కార్యక్రమ నిర్వహణలో నియుక్తులైన వారికందరికి ఆధునిక విజ్ఞానవిధానాలతో పరిచయం కలిగించి, తమ తమ బాధ్యతలను ఏలోటూలేకుండా తీర్చుకోగలిగేందుకుశిక్షణనిచ్చే నిమిత్తం శిక్షణకేంద్రాలుకూడా ప్రారంభింపబడినవి. ఈ శిక్షణ కేంద్రాలలో ఒకటి తూర్పుగోదావరిజిల్లాలో, కాకినాడరేవుకు వెళ్లే రైలుమార్గంలో, సామర్లకోట జంక్షన్‌కు నాలుగుమైళ్ళ దూరంలో, పెద్దాపురమనేచోట నెలకొల్పబడింది. ఈ కేంద్రం 1952, డిసెంబర్ 8 వ తేదీన పని ప్రారంభించింది.

### తొలిరోజులు.

విద్యార్థులు, అధ్యాపకులు అందరూ. యీపనికికొత్తవారే. వీరందరు, ఒకక్షణం తీరికయినా లేకుండా ఎంతో సందడిగా తిరుగుతుండేవారు. ఎటుచూసినా, ఎవరిదగ్గరకు వెళ్లినా అంతులేని ఉత్సాహం. కొందరు, అన్నిసమస్యలను ఒక్కసారి యెదుర్కొని ప్రతిఘటిద్దామని ఉబలాటపడుతుంటే, మఱికొందరు సమస్యలేవిటో, ఎక్కడున్నాయో తెలుసుకొనేందుకు ప్రయత్నం గట్టిగా చేస్తుండేవారు. కొందరొకచోటచేరి గ్రామసేవకుని కీకార్యక్రమంలోఉన్నపాత్ర ఎటువంటిదో చర్చించేవారు. "గ్రామసేవకుని శిక్షణ ఎట్లా ఉండాలి?" "గ్రామసేవకునికి శిక్షణ నివ్వడం ఏవిధంగా?" ఇటువంటి ప్రశ్నలనేకం వినిపిస్తుండేవి.

ఇక, భోజనవసతులు. ఈ విషయంలో వెంటనే ఏర్పాట్లు చేయవలసి వచ్చింది. జీతానికొక వంటవానిని కుదిర్చారు. వంట సామానులన్ని అద్దెకు తెచ్చారు. ఇందుకు కావలసిన డబ్బును విద్యార్థులవద్దనుండి ముందే సేకరించారు. రెవెన్యూ డిపార్ట్‌మెంట్‌వారి దగ్గరేవో కుర్చీలు, బల్లలు ఖాళీగా ఉన్నాయని తెలిసి, వాటిని తీసుకువచ్చి స్కూలులో అమర్చారు. ఇంతలో ప్రిన్సిపాల్ వచ్చారు. తరగతులు ప్రారంభ మైనై. మొదటి కొద్దిరోజులు, కమ్యూనిటి ప్రాజెక్టులేవిటో, వాటిలక్ష్యాలేవిటో చెప్పడంలో గడిచాయి. ఇందుకు, కమ్యూ నిటిప్రాజెక్ట్ల 'డ్రాఫ్టుహాండ్‌బుక్', నిలోఖేరిలో, ప్రాజెక్టు ఎక్సి క్యూటివ్ ఆఫీసర్లకివ్వబడిన ప్రముఖుల ఉపన్యాసాలు బాగా పనికి వచ్చాయ్. ఇక నిదర్శనసహిత తరగతులమాట. విద్యార్థులు, కేంద్రంలోనే వెనుకభాగంలో ఉన్న చిన్న దొడ్లో భూసార సంరక్షణప్రత్యక్షంగాచూసి, చేసి, నేర్చుకొన్నారు. ఒక కాయ కూరలతోటకూడా పెంచారు. ఈకొత్తకార్యక్రమంలో అధ్యాప కులు, విద్యార్థులు ఎంతో ఉత్సాహంగా పాల్గొన్నారు. కార్య క్రమాన్ని సాధ్యమైనంత ప్రయోజనకరంగా చేసుకొనేందుకు శాయశక్తులా పాటుపడ్డారు.

సాముదాయక అభివృద్ధికార్యక్రమంలో వ్యవసాయానికి ప్రత్యేకప్రాముఖ్యత యివ్వబడింది. అసలు, కార్యక్రమంలో వ్యవసాయం ముఖ్యాంశమనికూడా అనవచ్చును. అందువల్ల వ్యవసాయంలో గ్రామ సేవకులకు కావలసిన శిక్షణ నివ్వడానికి ఒక వ్యవసాయక్షేత్రాన్ని నెలకొల్పడం ఎంతో అవసరమనిపిం చింది. మొదట్లో, దాపులో ఉన్న పొలాలకు విద్యార్థులను తీసుకు

వెళ్తుండేవారు. అటువంటి సమయాల్లో భూముల యజమానులెంతో సహకరిస్తుండేవారు. పొలం పనిలో విద్యార్థులను స్వేచ్ఛగా పాల్గొననిచ్చేవారు. వీరికందరికీ విద్యార్థులు, అధ్యాపకులు ఎంతో కృతజ్ఞత చెందివుండేవారు.

రోజులుగడిచిన కొద్దీ అధ్యాపకవర్గంలోని 8 మందీవచ్చి చేరారు. రెండుమాసాల్లో ఈ కేంద్రానికి అన్ని హంగులూ అమరాయి. శిక్షణకార్యక్రమానికి పరిపూర్ణమైన అంతిమస్వరూపం వచ్చింది. గ్రామాలకు అప్పుడప్పుడు వెళ్తూండటం. ఒక్కొక సారి అక్కడే కొన్నిరోజులు గడుపుతుండటం ఈ కార్యక్రమంలో ఒక సామాన్యాంశమయింది. ఇందువల్ల శిక్షణకు వాస్తవికత చేకూరింది. ఈ కేంద్రంలో చేసి తెలుసుకోవ్మనేది శిరోధార్యమయింది.

ఈ విధంగా కొన్నాళ్లు గడిచాయి. ఉన్నవసతులు సరిపోయేవికావు. భవనాలు చిన్నవైనై. పరికరాలుకూడా అవసరమైనన్ని లేవు. ఇంకొక మంచిచోటికి కేంద్రాన్ని మార్పించాలని అందరికీ అనిపించింది. ఎంతోకాలం వెదక నక్కరలేకుండానే సామర్లకోట ఎల్లలో ఉన్న కొంతభూమి కన్పించింది. ఇది ప్రభుత్వంవారి అధీనంలో నిరుపయోగంగా వుంది. ఈస్థలం మధ్యనుంచే సామర్లకోటనుండి పిఠాపురానికి రోడ్డు వెళ్తుంది; ఈ స్థలాన్ని 'మిలిటరీ క్యాంపిగ్ గ్రౌండ్స్' అనేవారు. పాఠశాల పూలమొక్కలకు తోట, నమూనాకుక్కుటక్షేత్రం, ఇవన్నీ ఒకచోట నెలకొల్పాలంటే ఇంతకంటే ఆదర్శమైనస్థలం ఉంటుందా అనిపించేది. ఇందుకోసం ఈ భూమిలో నూరెకరాలు తీసుకోబడినయ్. 1954 మే నెలలో ఈ శిక్షణకేంద్రం పెద్దాపురం

నుండి, ఈ స్థలం పక్కనే ఉన్న ఒక అద్దెభవనంలోకి తరలింపం బడింది.

ఇక్కడ ఒక నమూనా శిక్షణ కేంద్రం నెలకొల్పడంలో వృథాకాలాయాపన ఏ మాత్రమూ జరగలేదు. వ్యవసాయశాఖ వారి దగ్గరనుండి బుల్ డోజర్లు, ట్రాక్టర్లు తెచ్చి భూమినంతా సమం చేసారు. వ్యవసాయక్షేత్రానికి కొంత స్థలాన్ని తయారుచేసారు. ఈ విధంగా తాము శిక్షణ పొందేందుకు భూమిని బాగుచేయ డంలో విద్యార్థులు క్షణమైనా ఊపిరి సలపకుండా పని జేసారు.

## తరగతులు.

మొదట్లో ఈ కేంద్రంలో గ్రామ సేవకులకు ఒకే 'షిఫ్ట్'లో పాఠాలు నేర్పబడేవి. కాని, జనవరి 1955 నుండి ఇది రెండు షిఫ్టలలో పని ప్రారంభించింది. ఇక్కడ వ్యవసాయంలో ప్రాథమిక శిక్షణకుకూడా వసతులు కల్పింపబడ్డాయ్. క్రమంగా, గ్రామ సేవికలకు గృహనిర్వహణ శాస్త్రంబోధించేందుకు ఒకభాగం. గ్రామంలో వృత్తికారులకు కమ్మరంలోను వడ్రంగంలోను శిక్షణ ఇచ్చేందుకు ఒక 'వర్క్‌షాప్', కేంద్రస్థాయిలో విస్తరణోద్యోగులకు నవీనతరగతులు, పంచాయితీ 'ఎక్జిక్యూటివ్' ఉద్యోగులకు సంకుశిక్షణ వసతులు నెలకొల్పడంతో, ఇప్పుడీ కేంద్రం కలకల లాడుతోంది. చిరకాలంలోనే ఇదొక నమూనా కేంద్రంగా విల సిల్లుతుందని ఆశింపబడుతోంది.

వ్యవసాయంలో ప్రాథమిక శిక్షణ 12 మాసాలకాలం పాటు కొనసాగుతుంది. ఈ శిక్షణపొంది, తదనంతరం జరుపబడే పరీక్షల్లో ఉత్తీర్ణులయే వారందరూ మరొక ఆరుమాసాలపాటు

'విస్తరణ' విధానాలలో శిక్షణ పొందవలసిఉంటుంది. వ్యవసాయంలో ప్రాథమిక శిక్షణనిచ్చే తగతులలో వ్యవసాయానికి, పశు సంవర్ధనకు ప్రాముఖ్యత యివ్వబడుతుంది. విస్తరణశిక్షణలో సాంఘిక విద్య, సహకారం, ప్రజారోగ్యం, గ్రామీణ పరిశ్రమలు, పంచాయతీలు మొదలైనవాటి కెక్కువ ప్రాధాన్యమివ్వబడుతుంది. పర్యవసానంగా శిక్షణపొందేవారు, బహుళార్థసాధకకృషిలో సిద్ధహస్తులవుతారు.

గ్రామసేవకులకు కొత్త విధానాలలో శిక్షణ రెండు నెలల పాటుంటుంది. వ్యవసాయం పశుసంవర్ధన, సహకారం, రంగాల్లో, కమ్యూనిటి ప్రాజెక్టులోను, సాముదాయక అభివృద్ధి కేంద్రాల లోను జాతీయ విస్తరణ సేవాకేంద్రాలలోను, పనిజేస్తున్న విస్తరణోద్యోగులు, పర్యవేక్షకులు, ఇందుకు అభ్యర్థులుగా పంపబడ్డారు. మొదటిజట్టుకు శిక్షణ 1956, అక్టోబర్ 15న ప్రారంభమయ్యింది. 1955, జూన్ 14 నాటికి మూడుజట్లు ఈ శిక్షణను పొందాయి. 1956 జూలై 15వ తేదినుండి నాల్గవజట్టుకు శిక్షణ ప్రారంభమవుతుంది. విస్తరణ కార్యకాలపాలద్వారా పురుషులు, స్త్రీలు, పిల్లలు, అందరు గ్రామీణ పునర్నిర్మాణంలో పాల్గొంటారు. అందుకనే, గ్రామసేవికలకు ప్రత్యేకంగా గృహనిర్వహణ శాస్త్రంలో శిక్షణ నివ్వాలనే ఉద్దేశంతో ప్రభుత్వం ఇక్కడ అందుకు కావలసినవసతులనన్నిటినీ నెలకొల్పింది. ఈ శిక్షణ పొందిన గ్రామసేవికలు గ్రామాల్లోనే పనిచేస్తుంటారు. అక్కడి స్త్రీలతో కలిసిమెలిసి తిరుగుతూ, వారి సమస్యలను పరిష్కరించుకొనేందుకు గ్రామాల్లో స్త్రీలకు సాయపడుతుంటారు. వీరిక్కడ నేర్చుకొనే విషయాలు: ఆహారశాస్త్రం, గుడ్డలు కుట్టడం, ఉతకడం,

మాతాశిశుసంరక్షణ, ఇంటిని చక్కబెట్టుకోవడం, ఆరోగ్యం, పారిశుద్ధ్యం, చేతిపనులు, కుటీరపరిశ్రమలు, వ్యవసాయం, కాయకూరల పెంపకం, పాలఉత్పత్తి, కోళ్ల పెంపకం, తేనె తీయడం, సహకారం, గృహశాస్త్ర విస్తరణ. శిక్షణకాలం ఒక సంవత్సరం.

నవీనమైన మేటి పరికరాల నుపయోగిస్తే వ్యవసాయం ఎంతో బాగుపడుతుంది. కాని, పరికరాలను ఎట్లా ఉపయోగించాలో మాత్రమే తెలిసుంటేచాలదు. వాటిని సరియైనస్థితిలో ఉంచుకోవడం తెలియాలి. ఏవైనాపాడైతే బాగుచేసుకోవడమెలాగో తెలియాలి. నవీన పరికరాలవాడకం, వాటిని తయారుచేయడం, బాగుచేసుకోవడం, అన్ని గ్రామంలోనే సాధ్యమయేందుకు ఈ శిక్షణాలయంలో ఒక వర్క్‌షాప్ నెలకొల్పబడింది. ఇందులో గ్రామస్థులకు మేటి వ్యవసాయపు పనిముట్లను తయారుచేయడంలోను, వాటిని బాగుచేసుకోవడంలోను, స్వల్పధరలకు గృహనిర్మాణంలోను, మగన్‌చూలాలు మొదలైనవాటిని కట్టుకోవడంలోను శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ శిక్షణ కాలంకూడా 12 మాసాలే.

ఈ శిక్షణ తరగతులలో ఏయే విషయాలు నేర్పబడ్డాయో, ఒక్కొక్క విషయానికి ఎన్ని 'పీరియడ్లు' కేటాయింపబడ్డాయో, దిగువ సూచికనుచూస్తే తెలుస్తుంది.

వ్యవసాయంలో ప్రాథమికశిక్షణ.

| | కేటాయింపబడిన పీరియడ్లు |
|---|---|
| 1. వ్యవసాయం | 1390 |
| 2. పశుసంవర్ధన, పశువైద్యం, పాలఉత్పత్తి | 350 |

| | |
|---|---|
| 3. పూలచెట్లు, కాయకూరల పెంపకం | 200 |
| 4. మొక్కలకు సంరక్షణ | 100 |
| 5. వ్యవసాయిక ఇంజినీరింగ్ | 60 |
| 6. వాతావరణ శాస్త్రం | 10 |
| 7. సామాన్య విస్తరణ | 10 |
| | 2120 |

అంటే, నిదర్శనాసహితమయిన తరగతులకయితేనేం, నిదర్శనా రహితమయిన తరగతులకయితేనేం, మొత్తం 2,120 పీరియడ్లు కేటాయింపబడినవన్నమాట. ప్రత్యక్షనిరూపణలద్వారా బోధన ప్రాతఃకాలంలో జరుగుతుంది. కేవలం ఉపన్యాసాల ద్వారా పాఠాలు మధ్యాహ్నమప్పుడు నేర్పబడుతయ్.

## విస్తరణ శిక్షణ.

ఇది ఆరు నెలల శిక్షణ తరగతి. వ్యవసాయ ప్రాతిపదికశిక్షణకేంద్రాలలో తమ తరగతులను పూర్తిచేసుకొన్న వారీ శిక్షణ పొందుతారు. వారు నేర్చుకొనేవిషయాలు, వాటి కివ్వబడినకాలం ఈ దిగువ ఇవ్వబడింది.

| | పీరియడ్లు. | | |
|---|---|---|---|
| | నిదర్శనా రహితతరగతులకు | నిదర్శనా సహితతరగతులకు | మొత్తం. |
| 1. వ్యవసాయం (పశుసంవర్ధన, వ్యవసాయిక ఇంజినీరింగ్, చెట్లపెంపకంతో) | 50 | 100 | 150 |

| | | | |
|---|---|---|---|
| 2. గ్రామీణ విస్తరణసేవ | 100 | 250 | 350 |
| 3. ఆరోగ్యం, పారిశుద్ధ్యం | 60 | 140 | 200 |
| 4. సాంఘికశాస్త్రం, వయోజన విద్య | 50 | 140 | 190 |
| 5. గ్రామపంచాయితీలు, సహకారం | 85 | 150 | 235 |
| 6. గ్రామీణపరిశ్రమలు | 25 | 50 | 75 |
| | 370 | 830, | 1200 |

## 'గ్రూప్ లెవెల్' కార్యకర్తలకు శిక్షణ.

ప్రత్యేక రంగాల్లో నిపుణుడు కావడమే కాకుండా సాధరణంగా ఒక సకలార్థసాధకునిగా గ్రామసేవకుని తయారుచేయడమే ఈ శిక్షణ యొక్క ఉద్దేశం.

ఈశిక్షణలో నేర్పబడే విషయాలు.

1. గ్రామీణ విస్తరణసేవ
2. వ్యవసాయం
3. పూలచెట్లు, కాయకూరలపెంపకం
4. మొక్కలకు రక్షణ
5. పశు సంవర్ధన
6. గ్రామీణ వృత్తులు, కళలు
7. ఆరోగ్యం, పారిశుద్ధ్యత, గ్రామీణపారిశుభ్రం
8. విద్య
9. సహకారం

10. పంచాయితీలు
11. రస్తాలు
12. గ్రామీణవినోదాలు, కాలక్షేపాలు.

## గృహశాస్త్రవిభాగం

ఇదివరకే చెప్పినట్లు ఇక్కడ స్త్రీలు, గ్రామాలలో స్త్రీలకు సేవచెయ్యగలిగేందుకు శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ శిక్షణ ఇవ్వడంలో ఉద్దేశాలేవిటంటే,

(1) గ్రామసేవికలకు, సాముదాయక అభివృద్ధి ప్రాంతంలో తమ విధులను సమర్థతతో నిర్వర్తించుకొనేందుకు కావలసిన, విద్యను, అనుభవాన్ని లభింపజేయడం.

(2) ఇక్కడ ఆచరింపబడే ప్రజాస్వామ్య విధానాన్ని గ్రామసేవికలకు తెలియజేయడం.

(3) గ్రామీణజీవితవిధానాల్లోకి, పోకడల్లోకి, చూసి గ్రామస్థుల, దృక్పథాలను, ఆశలను, ఆశయాలనూ, సమస్యలను అవసరాలను అర్థంచేసుకొనేందుకు గ్రామసేవికకు నేర్పడం.

(4) గ్రామసేవిక చేయవలసిన పనులలో ఒకటి, గ్రామంలోని ప్రతియింట్లోను, ఆహారవిషయాల్లోగాని, బట్టలవిషయంలో గాని, ఇంటినిర్వహణలో గాని, శిశుసంరక్షణలోగాని, వృత్తిలోగాని, సాంస్కృతిక విషయాల్లోగాని, మంచి అలవాట్లను ప్రవేశపెట్టడం. ఇందుకు కావలసిన, విజ్ఞానాన్ని, శక్తిని

గ్రామసేవికలో పెంపొందించడం ఈ శిక్షణయొక్క ఉద్దేశాలలో ఒకటి.

(5) విస్తరణ విధానాలలో గ్రామసేవికను నిపుణురాలిని చేయడం. ఇందువల్ల ఆమె ప్రతియింటికి, ఆధునిక విజ్ఞానాన్ని తీసుకుపోతుంది,

(6) గ్రామీణ, సమస్యలను చక్కగా పరిశీలించి అర్థం చేసుకునేందుకు గ్రామసేవికను తయారుచేయడం.

(7) మనదేశంలో అమలవుతున్న జాతీయవిస్తరణ సేవా కార్యక్రమంలోను, ఇంకా ఇతర పథకాలలోను తనపాత్రను గ్రామసేవికకు స్పష్టంగా తెలియ జేయడం.

ఈ ఉద్దేశాలతో, ఈ శిక్షణ ప్రత్యేకంగా ఇందుకోసమే తయారుచేయబడిన పాఠ్యప్రణాళిక నొకదాన్నంటిపెట్టుకొని కొన సాగుతోంది.

## పంచాయితీ ఎక్సిక్యూటీవ్ ఆఫీసర్లకు శిక్షణ.

జట్టు కిరవై మందివంతున రెండుజట్ల పంచాయత్ ఎక్సిక్యూటీవ్ ఆఫీసర్లకు రెండువారాల పాటుశిక్షణ యివ్వాలని సంకల్పింప బడింది. ఈ శిక్షణ తరగతి 1956, జూలై 1వ తేదినుండి ప్రారంభమయింది.

## వర్క్‌షాప్.

ఇక్కడ ఒక సంవత్సరంపాటు, గ్రామస్థులకు నవీన వ్యవసాయపరికరాలను తయారుచేయడంలోను వాటిని బాగుచేయడంలోను, తక్కువ వ్యయంతో ఇళ్లు కట్టుకోవడంలోను, మగన్‌చుళా

నిర్మాణంలోను, వడ్రంగం, కమ్మరంలోను శిక్షణ యివ్వబడుతుంది. ఒకసారి యిరవై మందికి శిక్షణ యివ్వబడుతుంది. ఇందువల్ల యెవరికి వారు చిన్నకర్మాగారా న్నొకదానిని తమ గ్రామాల్లోనే నెలకొల్పుకొనే అవకాశం లభిస్తుంది మొదటిజట్టుకి శిక్షణ నివ్వడం ఆగస్టు 1956 నాటికి పూర్తవుతుంది.

## ప్రత్యేక శిక్షణ తరగతులు.

పైన పేర్కొన్నవే కాకుండా ఇంకా ఇతర శిక్షణ తరగతులనేకం ఈ కేంద్రంలో నిర్వహింపబడుతున్నయ్. గ్రామీణ సంక్షేమ కార్యకలాపాల్లో నిమగ్నులైన వ్యవసాయపట్టభద్రులకు ఇతర ఉద్యోగులకు ఒక 'రిఫ్రెషర్' కోర్సు నడుపబడింది. వీరి కిచ్చిన శిక్షణ, 6 వారాలనుండి మూడు మాసాలవరకు కొన సాగింది.

పైలట్ ప్రాజెక్టులలో పనిచేయడానికి ఎన్నుకొనబడిన గ్రామ సేవికలకు, వారంరోజులపాటు, 'సోషల్ ఎడ్యుకేషనల్ ఆర్గనైజర్లు(స్త్రీలు)కు 10 రోజులపాటు, వారు తమతమ ఉద్యోగాలలో చేరకముందు శిక్షణ యివ్వబడింది ఈ శిక్షణ మార్చి, ఏప్రిల్, మే 1956 లో జరిగింది.

ఆంధ్ర విశ్వవిద్యాలయానికి అనుబంధమయిన కొన్ని కళాశాలల ఉపాధ్యాయులకు, విద్యార్థులకు ఒక వారంరోజుల పాటు గ్రామీణాభివృద్ధిలో 'ఓరియంటేషన్' శిక్షణ యివ్వబడింది. విశ్వవిద్యాలయాల్లోని విద్యార్థులకు, అధ్యాపకులకు ఈశిక్షణ భారత ప్రభుత్వంచేత ప్రారంభింపబడి నిర్వహింపబడింది. గ్రామీణాభివృద్ధిని ప్రత్యక్షంగా చూసి నేర్చుకొనేందుకు వీరు,

కాకినాడ – పెద్దాపురం కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతంలోను, తూర్పు గోదావరిజిల్లాలోని రాజానగరం, కోరుకొండ సాముదాయక అభివృద్ధి కేంద్రాలలోను, గ్రామీణాభివృద్ధికి నియమింపబడ్డారు.

1954, డిసెంబర్ 31 వ తేదీవరకు ఈ కేంద్రం ఒకే షిఫ్టులో పనిచేసింది. అప్పుడు 50 అభ్యర్థులకు విస్తరణశిక్షణ నిచ్చేందుకు ఈ కేంద్రానికి మంజూరుండేది. కాని రోజులుగడిచిన కొద్ది కొత్తగా నెలకొల్పబడిన బ్లాకులసంఖ్య పెరిగిపోయింది. గ్రామసేవకుల అవసరం నానాటికి అధికమవుతూ వచ్చింది. తత్ఫలితంగా ఈ కేంద్రం 1955, జనవరి 1 వ తేదినుండి, రెండుషిఫ్టుల్లో పనిచేయడం ప్రారంభించింది. ఈ కేంద్రానికి ఒక ప్రాతిపదిక వ్యవసాయశిక్షణ విభాగంకూడా చేర్చబడింది.

సాముదాయక అభివృద్ధి కార్యక్రమానికి ముందు, మన రాష్ట్రంలో, గ్రామీణ సంక్షేమపథక మొకటి అమలులోఉండేది. దాని నిర్వహణలో కొందరు గ్రామసేవకులు పాల్గొంటుండేవారు. సాముదాయక అభివృద్ధి కార్యక్రమం అమలులోకి రాగానే వీరి కందరికి గోపన్నపాలెంలో 6 నెలలపాటు శిక్షణనిచ్చి, ఈ కొత్త పథకంలో చేర్చుకొన్నారు. కాని ఈ కొత్తపథకాల నిర్వహణకు సంబంధించిన అనేక విషయాలలో వారికి శిక్షణ నిచ్చేందుకు, వారు రెండుజట్లుగా ఈ కేంద్రానికి పంపబడ్డారు. ఇక్కడ వారికి 4½ నెలలకాలం తీవ్రతరమైన శిక్షణ ఇవ్వబడింది. ఈ శిక్షణ రెండుగడువులలో కరిగింది. వీరుకాక, వ్యవసాయ శాస్త్రంలో పట్టభద్రులు, అనుభవశాలురైన ఫీల్డ్ మెన్ కూడా, ఎక్కువ మంచిది ఉద్యోగాలకు సిద్ధంగాఉండేవారు. వీరినికూడా గ్రామసేవకులుగా

తీసుకొని, ఉద్యోగ కాలంలోనే, వారికి, మూడునెలల శిక్షణ నిచ్చారు.

## అధ్యాపక వర్గం

అధ్యాపకవర్గంలోని వారందరు మంచివిషయజ్ఞులే కాకుండా అనుభవజ్ఞులు కూడా. ఇక్కడ బోధనా విషయాలలో వ్యవసాయానిది ముఖ్యస్థానం కావటాన, అధ్యాపకవర్గంలో ఎనిమిదిమందీ వ్యవసాయశాస్త్రంలో పట్టభద్రులే ఉన్నారు. వ్యవసాయంలో ఒక అధ్యాపకుడు డెన్మార్కులో శిక్షణ పొందారు. గృహశాస్త్ర విభాగంలో ప్రధాన అధ్యాపకురాలు, భారతదేశంలోను, విదేశాల్లోనుకూడా శిక్షణ పొందారు. మరియొక అధ్యాపకురాలు, ప్రస్తుతం అమెరికాలో శిక్షణ పొందుతున్నారు.

## విద్యార్థులు.

ఈ శిక్షణకు విద్యార్థుల నెన్నుకొనే నిమిత్తం, అభివృద్ధి కమీషనర్, వ్యవసాయ, మత్స్యశాఖా డైరెక్టరు, జిల్లాకలెక్టరు, పాఠశాల ప్రిన్సిపాల్, ఇద్దరు అనధికారులు, ఒక రక్షణ శాఖోద్యోగి సభ్యులుగాగల సంఘం, విద్యార్థులను ముఖాముఖి పరీక్షిస్తుంది. ఈశిక్షణ పొందగోరే ప్రతివిద్యార్థి 18 ఏళ్లకు తక్కువ గాని వయస్సుగలిగి, స్కూల్ ఫైనల్ పరీక్షలో ఉత్తీర్ణులయి ఉండాలి. ఎన్నుకోబడిన విద్యార్థులందరూ వ్యవసాయశిక్షణ తరగతిలో చేరుతారు. శిక్షణ ప్రారంభమయిన ఒక మాసానికి, వీరి నొక సంఘం పరీక్షించి ఈ శిక్షణకు పనికిరాదనిపించినవారిని తొలగిస్తుంది. మిగిలినవారందరూ ఈ శిక్షణను పూర్తిచేసుకొని మరొక ఆరుమాసాలపాటు విస్తరణలో శిక్షణ పొందుతారు.

ఈ శిక్షణపొందే విద్యార్థుల కందరికి వ్యవసాయశిక్షణ పొందుతున్నంతకాలం నెలకు 30 రూపాయల ఉచితవేతనం, విస్తరణశిక్షణ పొందుతున్నంతకాలం నెలకు 50 రూపాయల ఉచిత వేతనం లభిస్తుంది. ఈ వసతి గ్రామసేవకులకే గాకుండా గృహశాస్త్ర విద్యార్థినులకుకూడా లభిస్తుంది.

ఈ శిక్షణపొందే విద్యార్థులందరూ 660 రూపాయల కొక బాండ్ ఇచ్చుకోవాలి. శిక్షణ పొందుతున్నంతకాలం, ప్రభుత్వపు నిబంధనల నుల్లంఘించమని, మధ్యలో విరమించుకోమని, ఉద్యోగంలో చేరిన నాలుగు సంవత్సరాలవరకు దానిని వదలమని హామీ ఇచ్చుకోవాలి.

విద్యార్థి నిబంధనల నుల్లంఘించినా, శిక్షణకాలంలో వారి నడవడిక సంతృప్తికరంగా వుండకపోయినా, శిక్షణ మధ్యలో ఆగిపోయినా వారికిచ్చిన ఉచిత వేతనాలు తిరిగి తీసుకోబడుతయ్.

## గృహవసతి ఇతర సౌకర్యాలు.

శిక్షణపొందే వారందరూ డబ్బేమీ ఇవ్వనక్కరలేకుండా ఈ వసతి గృహంలో ఉండవచ్చును. ఈ వసతి గృహానికి మంచి నీటివసతి, విద్యుద్దీపాలు, ఉన్నయ్. విశాలమైన భోజనశాల, వంటిల్లు, సామాన్లగది అన్నీ ఈ హాస్టల్‌లోనే ఉన్నయ్. మరుగుదొడ్లు, స్నానాలగదులుకూడా ఉన్నయ్. ఆటలకు, వ్యాయామానికి, వినోద కార్యక్రమాలకు కావలసిన సరంజామా అంతా చేకూర్చబడింది ఇవి ఆయా విషయాలను చూసే సంఘాల కివ్వబడుతాయి. ఈ వసతిగృహానికి ఒక సమాజ కేంద్రంకూడా చేర్చబడింది. ఇక్కడ, ఒక పఠనామందిరం, ఒక పుస్తక భాండారం

సంగీత వాయిద్యాలు ఉన్నయ్ తమ తీరిక సమయాలను విద్యార్థు లిక్కడ గడుపుకోవచ్చును.

## విద్యార్థి సంఘాలు.

విద్యార్థులలో సంఘీభావం పెంపొందడానికి, వారిలో నాయకత్వం అభివృద్ధికావడానికి, కొన్ని విద్యార్థిసంఘాలు నెల కొల్పబడ్డాయి. ఈ సంఘాలు, ఆటల అభ్యాసంలో అధ్యాపకునికి సాయపడుతయ్. భోజనశాలలను నడుపుతూ వాటి జమాఖర్చులను సరిపెడ్తుంటయ్. కేంద్రంలోను, ఇతరచోట్ల వినోదకార్యక్రమాలను నిర్వహిస్తుంటయ్. వసతిగృహంలోని గదులను వాటి పరిసరాలను శుభ్రంగా ఉంచుతవి. సినిమా ప్రదర్శనలను నిర్వహిస్తయ్ విద్యార్థులకు సూర్యనసమస్కారాలు, ఆసనాలు నేర్పుతుంటయి.

## విద్యార్థులు, గ్రామసేవ.

గ్రామాలతో సేవచేయాలనే ఉద్దేశంతో విద్యార్థులు. కేంద్రానికి దాపునవున్న గ్రామాలలో నాలుగింటిని ఎన్ను కొన్నారు. అవి రాగంపేట, వడ్లమూరు, వేట్లపాలెం, సామర్ల కోట. విద్యార్థులు, తమ అధ్యాపకునితోపాటు, జట్లుగా యీ గ్రామాలకు వెళ్తారు. అక్కడవారు చేసేపనులు:—

ఎరువుల ప్రయోగాలను ప్రదర్శిస్తారు. క్రిమిహరాలను వెద జల్లే యంత్రాలను మొక్కల సంరక్షణకే విధంగా ఉపయోగించ వచ్చునో చూపిస్తారు.

కేంద్రంలో ఉత్పత్తయిన విత్తులతో గ్రామాల్లో కాయ కూరలతోటలు వేస్తారు. ఎరువులు చెడిపోకుండా జాగ్రత్త చేయ డమేవిధంగానో ప్రదర్శిస్తారు.

పటాలు, స్లైడ్లు మొదలయినవాటి నుపయోగిస్తూ చదువు చెప్తారు.

గ్రామంలో సమావేశాలు, చర్చలు జరిపిస్తారు. గ్రామంలో వార్తలను ప్రసారంచేస్తారు.

ఆదివారాలప్పుడుగాని, ఏవైనా పండగలు, ఉత్సవాలువచ్చి నప్పుడు, వీరు గ్రామంలో భజనలు, వినోద కార్యక్రమాలు జరుపుతారు.

బావులలో 'క్లోరిన్' జిమ్మి పరిశుభ్రం చేస్తారు. అనేక రకములయిన సహకారసంస్థల స్వభావ స్వరూపాలను, అవి పని చేసే విధానాలను, వాటికి సంబంధించిన లెక్కలనుగూర్చి తెలుసుకొంటారు. గ్రామాలలో పుస్తకభాండాలను సందర్శిస్తారు. వాటిని నెలకొల్పి నిర్వహించడమెలాగో తెలుసుకొంటారు.

## పరిశీలనా పర్యటనలు.

ఈ జిల్లాలో పర్యటించడమే కాకుండా విద్యార్థులు, పక్క జిల్లాలోని, వ్యవసాయ పరిశోధనా కేంద్రం, నమూనాతోటలు, నీటి పారుదల పథకాలు, సహకారసంస్థలు, కృత్రిమ పశుసంవర్క కేంద్రాలు, పాలఉత్పత్తి క్షేత్రాలు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు పుస్తకభాండారాలు, మార్కెట్లు, ఇంకా చూడదగిన సంస్థలేవైనాఉంటే వాటిని సందర్శిస్తారు. వాటినిచూసి అవి ఏవిధంగా పనిజేస్తున్నారో ప్రత్యక్షానుభవంవల్ల తెలుసుకొంటారు.

## దినక్రమం.

గ్రామస్థుని తీరికసమయం లాభకరంగా సద్వినియోగం కావడానికి సహాయపడడం గ్రామసేవకుని ముఖ్యకర్తవ్యం. కాని

ఇందుకు గ్రామ సేవకుడే తన తీరుబడి కాలాన్ని, సద్వినియోగం చేసుకోవడం, తన కాలంలో ఏమాత్రమూ, వృథా జేసుకోక పోవడం ప్రధానం. ఈ అలవాటతనికి క్రమంగా కలిగించాలనే ఉద్దేశంతోనే, ఇక్కడ దినక్రమం తయారుచేయబడింది.

ఇంతేకాకుండా, విద్యార్థులలో ఆత్మనిగ్రహం పెంపొందుతుంది. చెమటోడ్చడంలోఉన్న గౌరవం వారికి బాగా తెలుస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే వారి దృక్పథమే మారిపోతుంది.

## విద్యార్థుల దినక్రమం.

| | |
|---|---|
| ప్రొద్దున 5.00 | నిద్రలేస్తారు. |
| 5.00 నుండి 5.30 వరకు | ప్రాతఃకాలవిధులు |
| 5.30 నుండి 5.45 వరకు | గదులను పరిసరాలను, స్నానాలగదులను దొడ్లను శుభ్రంచేసుకోవడం |
| 5.45 నుండి 6.00 వరకు | ప్రార్థన |
| 6.00 నుండి 6.30 వరకు | వ్యాయామం, ఆసనాలు, సూర్యనమస్కారాలు. |
| 6.30 నుండి 6.50 వరకు | ఫలహారం |
| 6.50 నుండి 7.00 వరకు | విరామం. |
| 7.00 నుండి 11.00 వరకు | ఉపన్యాసతరగతులు |
| 11.00 నుండి 12.00 వరకు | భోజనం |
| 1.00 నుండి 2.00 వరకు | పఠన |
| 2.00 నుండి 6.00 వరకు | నిదర్శనా సహితమయిన తరగతులు |

6.00 నుండి 7.30 వరకు ఆటలు, ఆటపోటీలు
వ్యాయామం

7.30 నుండి 8.30 వరకు భోజనం

8.30 నుండి 10.00 వరకు పఠన

10.00 నిద్రవేళ.

విస్తరణ శిక్షణ కేంద్రంలోను, ప్రాథమిక వ్యవసాయ శిక్షణ భాగంలోను, గృహశాస్త్ర విభాగంలోను, గ్రూప్ లెవల్ తరగతులలోను, వర్క్‌షాప్‌లోను మొత్తం ఆరుతరగతులు అమలులో ఉన్నాయ్.

## భవనాలు.

విస్తరణ కేంద్రానికి పిఠాపురం, పెద్దాపురం రోడ్డునాను కొని 100 ఎకరాలభూమి తీసుకోబడింది. ఇందులో కొంచెంఎత్తు ఎక్కువగా ఉన్నభూమి 17 ఎకరాలమేరకు భవనాలకోసం ప్రత్యేకింపబడింది.

మొదట్లో పాఠశాల ముఖ్యభవనం, వసతిగృహంలో గదులు వంటయిల్లు, భోజనశాల. స్నానాలగదులు, మరుగుదొడ్లు, వీటి నిర్మాణంపై పని ప్రారంభమయింది. పాఠశాల 1955 ఏప్రిల్ 15 నుండి కొత్తభవనాల్లోకి ప్రవేశించి పని ప్రారంభించింది. కొద్ది రోజుల్లోనే ఒకబావి త్రవ్వబడింది. ఒక ఓవర్ హెడ్ ట్యాంక్ నిర్మించబడింది. విద్యుచ్ఛక్తి ఇవ్వబడింది.

కొత్తతరగతుల ప్రారంభంతో కొత్త భవనాల ఆవశ్యకత పెరిగింది. 1956 లో కొత్తభవనాల నిర్మాణం ప్రారంభమయింది. గృహశాస్త్ర విభాగానికి, వర్క్‌షాప్‌కు, పంచాయతీ ఆఫీసర్ల తర

గతికి భవనాల నిర్మాణం, పూర్తయింది. ఆయాశాఖలు నూతన భవనాల్లోనే పనిచేస్తున్నాయ్.

కేంద్రానాన్నానుకొనిఉన్న వ్యవసాయక్షేత్రంయొక్క నిలవ గది నిర్మాణంకూడా పూర్తికావచ్చింది.

వర్క్‌షాప్ సిబ్బందికి, గృహశాస్త్ర అధ్యాపకులకు వ్యవసాయిక ఆర్థికవేత్తకు ఇళ్లుకట్టి యివ్వబడ్డవి.

భారత కాంక్రీట్ అసోసియేషన్ వారి పర్యవేక్షణలో, వారి సహాయంతో ఇక్కడ పరిమిత ఆదాయంగల వారికోసమై ఉద్దేశింపబడిన ఒక నమూనాగృహం కట్టబడింది. ఈగృహాన్ని నిర్మించినందుకు వెయ్యిరూపాయలు ఖర్చయినవి. ఈ గృహనిర్మాణానికి కావలసిన సామగ్రిని సమకూర్చడంలోను, నిర్మాణంలోను ఈ కేంద్రంలోని విద్యార్థులు ఎంతో పాటుపడ్డారు. వీరుచేసిన శ్రమదానం ఫలితంగా 300 రూపాయలదాకా ఆదా జరిగిందని అంచనా వేయబడింది.

పాఠశాల శాశ్వతభవనాలు రూపొందకపూర్వం, విద్యార్థులవసతికి మరియొక్క చిన్నఇల్లు కట్టవలసి వచ్చింది. ఈ భవన నిర్మాణంలోకూడా విద్యార్థుల శ్రమదాన ఫలితంగా 400 రూపాయలదాకా ఆదా జరిగింది. ఇప్పుడీ భవనమే వ్యవసాయ క్షేత్రం యొక్క నిలవగదిగా ఉపయోగింప బడుతోంది. గృహప్రాంగణాలు కన్నులకింపుగా ఉండాలంటే ఎన్నో పనులు చేయాలి. చక్కటి పూలతోటలు, పెంచాలి. తీర్చి దిద్దినట్లుండే బాటలు వేయాలి. భవనాన్ని, పరిసరాన్ని సుభ్రంచేయాలి. అప్పుడుగాని, అవి నేత్రానందంగాను కనులపండువగాను ఉండవు. ఈ పనంతా ఎంతో చురుకుగా సాగిపోతూంది.

## పరికరాలు, సామగ్రి.

పాఠశాలలో తరగతులకు, అధ్యాపకుల విశ్రాంతిగదులకు, ఆఫీసుకు, ప్రదర్శనశాలకు పఠనామందిరానికి కావలసిన శాయ్యసామానంతా సమకూర్చ బడింది. కావలసినపుడల్లా మరి కొంత అదనంగా సమకూర్చబడుతోంది. ఈ శిక్షణ కేంద్రానికి ఒక జీప్ కూడా ఇవ్వబడింది. బోధనలో కేవలం ఉపన్యాసాలకే కాకుండా శ్రవ్య, దృశ్య బోధనామార్గాలకుకూడా కొంత స్థానమున్నది. ఇందుకు ఈ కేంద్రంలో ఒక 16 m. m సౌండ్ ప్రొజెక్టర్ తెర, ఒక ట్రాన్స్ఫార్మర్, ఒక విద్యుదుత్పత్తి యంత్రం ఒక పదివాల్వుల ఫిలిప్స్ రేడియో, ఒక రోలిఫ్లెక్స్ కెమెరా, ఒక గ్రామఫోన్; ఇంకా ఇతరపరికరా లున్నవి.

ఒనేకరకాల ఆటలకు కావలసిన పరికరాలుకూడా సమకూర్చబడినవి. వ్యాయామానికొక అధ్యాపకుడుకూడా ఉన్నాడు. ఈయన పర్యవేక్షణలోనే, విద్యార్థుల ఆటలు, వ్యాయమం జరుగుతయ్.

ఒక మిమియోగ్రాఫ్ యంత్రంకూడా ఈ కేంద్రంలో ఉన్నది. విద్యార్థుల పాఠాలు దీనితో అచ్చువేస్తారు.

## విశ్రాంతి, వినోదం.

ముందు ముందు విద్యార్థులు చేయవలసిన పని కష్టతరమయింది. ఇందుకు వీరిలో చురుకుతనం, చలాకీ, దేహబలం పెంపొందింప జేయడం ఎంతో అవసరం. ఇది వ్యాయామం ద్వారా, ఆటలద్వారా సాధ్యమవుతుంది. అందుకనే ఇక్కడ వాలీబాల్ బాడ్మింటన్ మొదలయిన ఆటలకు ఏర్పాట్లు చేయ

బడ్డాయి. విద్యార్థులు అనుదినం ఈ ఆటలు అడుతుంటారు. చెడుగుడు, ఖోఖో మొదలయిన ఆటలుకూడా వీరు ఆడుకోవచ్చును. వ్యాయామంకోసం, అనేక పరికరాలున్నవి. వీరికి సూర్యనమస్కారాల్లోను, ఆసనాల్లోను శిక్షణ లభిస్తుంది.

## శిక్షణ పొందినవారు.

ఇంతవరకూ ఈ కేంద్రంలో వివిధశాఖల్లో ఎంతమందికి శిక్షణ యివ్వబడిందీ, ప్రస్తుత మెంతమందికి ఇవ్వబడుతోందీ, యీ సూచికనుండి తెలుసుకోవచ్చును.

| శిక్షణ | శిక్షణపొందిన వారి సంఖ్య. | శిక్షణపొందు తున్నవారిసంఖ్య. |
|---|---|---|
| 1. గ్రామ సేవకులకు విస్తరణ విధానాలలో శిక్షణ | 502 | 106 |
| 2. బేసిక్ వ్యవసాయ శిక్షణ | 83 | 64 |
| 3. వ్యవసాయ శాస్త్రంలో పట్ట భద్రులకు, వ్యవసాయశాఖ ఫీల్డ్‌మెన్‌కు, పూర్వపు గ్రామీణ సంక్షేమశాఖ సిబ్బందికి 'రిఫ్రెషర్' శిక్షణ | 148 | ... |
| 4. విస్తరణోద్యోగులకుశిక్షణ | 26 | 14 |
| 5. గ్రామసేవికలకు శిక్షణ | ... | 20 |
| 6. వృత్తికారులకు శిక్షణ | ... | 20 |

| | | |
|---|---|---|
| 7. గ్రామసేవికులకు ఉద్యోగ పూర్వ శిక్షణ | 42 | ... |
| 8. సాంఘిక విద్యావ్యవస్థాపకుల(స్త్రీలు)కు శిక్షణ | 21 | ... |
| 9. ఆంధ్ర విశ్వవిద్యాలయ, అధ్యాపకులకు, విద్యార్థులకు, కొంతమందికి, గ్రామీణాభివృద్ధిలో 'ఓరియెంటేషన్' శిక్షణ | 79 | ... |
| 10. గ్రామనాయకుల శిక్షణ | 40 | ... |

పంచాయతీల ఎక్జిక్యూటివ్ ఆఫీసర్లకు, 1956 జూలై ఒకటవ తేదీనుండి ఒక "ఓరియంటేషన్" శిక్షణ ప్రారంభమయింది.

## వ్యవసాయం.

ఇన్నిరకాల శిక్షణలున్న యే కేంద్రానికయినా, ఒక చక్కటి వ్యవసాయక్షేత్రం, పాలఉత్పత్తికేంద్ర ఉండటం ఎంతో అవసరం. ఈక్షేత్రంలో విద్యార్థుల ప్రత్యక్షానుభవాన్ని ఎంతయినా గడించవచ్చును. ఈ క్షేత్రంలో కేవలం విద్యార్థులకు శిక్షణవసతులను కల్పించడానికే కాకుండా, ఆహార ధాన్యాల్లోను, కాయకూరలు, పాలు, గుడ్లు చేపలు మొదలయిన వాటిలోను, విద్యార్థులు, అధ్యాపకుల అవసరాలను తీర్చడానికికూడా ఎన్నో ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ క్షేత్రంలోని పశువులకు కావలసిన గడ్డి, గాదం సైతం, ఇక్కడే పెంచబడ్తున్నది. అనేక రకములయిన

వ్యవసాయ విధానాలు అవలంబింపబడుతున్న ఈ క్షేత్రంలో, పరిసర ప్రాంతాల్లోని రైతులకు, నవీన వ్యవసాయ విధానాలను ప్రదర్శనలద్వారా తెలియజేస్తారు. వీటివల్ల రైతుల్లో ఉత్సాహాన్ని పెంపొందింపజేస్తారు. అప్పుడప్పుడు రైతులు ఈ కేంద్రాన్ని సందర్శించడానికి ఏర్పాట్లు చేస్తారు. ఈచర్యల ఫలితంగా ఈక్షేత్రం ఒక నమూనా క్షేత్రంగా విలసిల్లుతుంది.

ఈ ఉద్దేశంతో, చవిటిపర్రనుండి, ఎంతో వ్యయంతో ఒక చక్కటి సుభిక్షమయిన వ్యవసాయ క్షేత్రాన్ని తయారు చేయడ మయింది. ఇందుకు అవసరమయినచోట్ల బాటలు, నీటి పారుదలకు కాలువలు కట్టారు. ఒక పద్ధతిప్రకారం, ఈక్షేత్రాన్ని ఖండాలుగా విభజించారు. భూమిన సమతలంచేసి, చెరువుగట్లనిలో మట్టితోను, పచ్చిఎరువుతోను. దానిని సారవంతం చేశారు. భూమికిసారం, చేకూర్చడానికి మామూలు పంటలతోపాటు, పిల్లిపెసర, మినములు మొదలయిన ఎరువు పంటలు పండిస్తున్నారు. వీటన్నిటితోపాటే ఒక నిర్ణీతక్రమం ప్రకారం, వరి, చెరుకు, అరిటి, జొన్న, రాగిసజ్జ పంటలుకూడా పండిస్తున్నారు. దేశి, విదేశి కాయకూరలనుకూడా పండిస్తున్నారు. వానకి, మంచుకి పాకాడుని గ్రాసాన్నికూడా పెంచుతున్నారు. ఈ పంటలను పండించడానికి భూమిని తయారు చేయడంలోను, నారు వేయడం లోను, ఎరువులు వేయడంలోను, నార్లు వేయడంలోను కోతల్లోను విద్యార్థులు పల్గొంటున్నారు.

ఈ వ్యవసాయక్షేత్రంలో ఇంతవరకు సాధింపబడిన ఫలితాలెంతో ఆశాజనకంగా ఉన్నాయి. మొదటి సంవత్సరంలో

ఇక్కడ 2 ఎకరాలమేర జపాన్ పద్ధతిని వరి సాగయింది. ఎకరానికి 40 మణుగులు, అంటే, సుమారు 3,300 పౌనులధాన్యం లభించింది. చెరకు ఎకరానికి 50 టన్నులు పండింది. ఎకరానికి, 2000 ల పౌనుల రాగులు లభించేయి. రెండెకరాలమేర కిక్కడ విదేశీ కాయకూరలు పండించబడ్డాయి. 1500 రూపాయల ఖరీదు చేసే కాయకూరలు, 400 రూపాయల ఖరీదుచేసే విత్తనాలు లభ్యమైనై. ఇక్కడ పండించిన ఆహార ధాన్యాలు, కాయకూరలు విద్యార్థుల అవసరాలకు అంది వచ్చాయి. తమ కష్టఫలాన్ని తామనుభవించ గలిగామనే సంతృప్తికూడా వారికి లభించింది. మొదట్లో లభించిన ఈ ఫలితాలు, సాగులోఉన్న భూమి వైశాల్యాన్ని విస్తరింపజేయడానికి విద్యార్థులు, అధ్యాపకులు చేస్తున్న కృషికి ఎంతో ప్రోత్సాహాన్నిచ్చేయి. చెరకు సాగు నాలుగెకరాలకు, కాయకూరల పెంపకం నాలుగెకరాలకు, అరటి చెట్ల పెంపకం రెండెకరాలకు పెంచబడింది. మిగిలిన భూమిలో, గ్రాసం, ఎరువుకు పనికివచ్చే పంటలు పండించబడు తున్నాయి. వర్తమాన సంవత్సరంలో, ఈ పైపంట లన్నిటినీ, 16 ఎకరాల వైశాల్యంలో, విద్యార్థులచేతనే పండించాలని సంకల్పింపబడింది. వీరికి కొందరి కూలీలసహాయం, అధ్యాపకుల సలహాలు మాత్రమే లభిస్తవి. ఈ కేంద్రంలో నీళ్ళకు లోటులేదు. ఆరు 'బోర్' బావులు తవ్వబడ్డాయి. వీటిలో రెండింటికి మోటార్లు పంప్‌సెట్లు అమర్చబడినాయి. 30 అడుల వెడల్పుగలిగి, 35 అడుగుల లోతు గల బావి తవ్వబడింది. దీని నిర్మాణం అంతా సిమెంట్ బ్లాకులతో జరిగింది. పర్యవేక్షణ, భారత కాంక్రీట్ అసోసియేషన్ వారిది. ఇందులోనుండి, మరొక "బోర్" బావినుండి, నీరు రెండు

నూనె యంత్రాలతో లేపబడుతున్నాయి. ఈ యంత్రాలు వ్యవసాయ శాఖవారి వద్దనుండి తీసుకోబడ్డవి.

## ఉద్యాన కృషి.

ఈ కేంద్రంలో ఒక చక్కటి నమూనా ఉద్యానవనాన్ని నెలకొల్పేందుకు 12 ఎకరాల మేరకు భూమి చదును చేయబడుతోంది. ఇక్కడ మేటిరకాల మొక్కలు పెంచి, రైతులకు పంచుతారు. నాలుగెకరాల మేరకు, ఇప్పటికే మామిడిజాతులు పెంచబడుతున్నాయి. లాభదాయకమైన పంటలు, వంటచెరుకు, ఎరువుకు పనికివచ్చే ఆకులుగల చెట్లు, కొద్దికాలంలోనే కాయలుకాసే బొప్పాయవంటిచెట్లు పెంచేందుకు వసతులుకూడా ఇక్కడ కల్పింపబడుతున్నాయి. ఈ మొక్కలను, కర్నూలు కడపకాలవ ప్రాంతంలోని గ్రామాల్లో పంచుతారు. గ్రామస్థులు కాయకూరలు పెంచుకోడానికికూడా మొక్కలు ఇవ్వబడుతవి. ఇక్కడ త్రవ్వబడిన బావినుండి నీరు తోడేందుకు ఒక టర్బైన్ పంపు అవసరం. అది అందగానే ఇంకా ఎన్నో ఫలవృక్షాలు పెంచేందుకు ఏర్పాట్లు జరుగుతాయి.

## చేపల పెంపకం.

చేపల పెంపకానికికూడా ఇక్కడ వసతులు కల్పింపబడుతున్నయ్. నాలుగు ఎరాకలమేర, నాలుగు చెరువులు త్రవ్వబడినవి. ఇక్కడ్క కాట్లా, మ్రిగల్, లాబ్కో, జాతికిచెందిన చేపపిల్లలు ఉంచబడినయ్. ఆరుమాసాలైనా కాకుండా ఇవి ఒకపౌను బరువు కెదిగాయి. వీటి పెంపకమంతా విద్యార్థులే నిర్వహించారు. వీరికి, అధ్యాపకవర్గంలోనే ఒకరు కావలసిన సలహాలిచ్చారు.

## పాల ఉత్పత్తి.

విద్యార్థులకు పాలఉత్పత్తిలోను, పశువైద్యంలోను శిక్షణ నిచ్చే నిమిత్తం ఒక కేంద్రం నిర్వహింపబడుతున్నది. ఇందులో 14 ఎనుములు 9 ఆవులు ఉన్నయ్, ఈ కేంద్రంలో విద్యార్థులు పశుశాలలను శుభ్రంగా ఉంచడం, పాలను, పాలను నిల్వచేసే సామాన్లను పరిశుభ్రంగా ఉంచడం, పశువులకుకలిగే సాధారణ వ్యాధులను నయంజేయడం, వాటికి టీకాలు పొడవడం నేర్చు కొంటారు. ఇక్కడి ఉత్పత్తంతా, విద్యార్థులకు, అధ్యాపకులకు అమ్మబడుతుంది.

## కోళ్ల పెంపకం.

ఇక్కడ ఒక నమూనా కుక్కుట క్షేత్రంకూడా నెలకొల్ప బడింది. దీని నిర్వహణాబాధ్యతను ఒక సహాయక వెటర్నరీ సర్జన్ వహిస్తున్నారు. దీని యాజమాన్యాన్ని కాకినాడలోని ప్రాజెక్టు ఎక్జిక్యూటీవ్ ఆఫీసర్ నిర్వహిస్తున్నారు. ఇక్కడ గుడ్లను పొదిగే యంత్రాలు, పరిశుభ్రమయినశాలలు, ఇంకా ఇతరవసతులెన్నో ఉన్నాయ్.

## ఇతర కార్యకలాపాలు.

### సాంఘిక సాంస్కృతిక కార్యక్రమాలు.

గ్రామస్థులకు, సులభగ్రాహ్యమయిన వివిధ విధానాల ద్వారా వారికి, నవీన వ్యవసాయ విధానాలను తెలియజేయడం, విస్తరణోద్యోగుల ముఖ్యకర్తవ్యం. ఇది గేయాలద్వారా, నాటకాలద్వారా, కథలద్వారా, సినిమాప్రదర్శనలద్వారా చిన్నచిన్న ఉపన్యాసాలద్వారా సాధ్యమవుతుంది. సాంఘికవిద్య అధ్యాపకుని

పర్యవేక్షణలో ప్రతి శనివారం సాయంత్రం, ఈ పద్ధతుల్లో సాంస్కృతిక కార్యకలాపాలను జరిపేందుకు వివిధశాఖలనుండి, ప్రతినిధులుగల ఒక విద్యార్థిసంఘం నెలకొల్పబడింది. ఈ కార్యక్రమంలో, సంగీత, నాటక, సినిమా ప్రదర్శనలు, పాటలు జానపద గేయాలు అంశాలు. వీటి కథావస్తువు, జాతీయవిస్తరణసేవ, పంచవర్ష ప్రణాళిక, గ్రామీణోద్ధరణలోని కార్యకలాపాలు. ఈ కార్యక్రమంలో, విద్యార్థులు, అధ్యాపకులు పాల్గొంటారు. ఇందువల్ల వారికి శిక్షణ లభించడమేకాకుండా, వారిమనస్సులకు, విశ్రాంతి, ఉల్లాసంకూడా లభిస్తాయి. వచ్చేవారం తమ పనులను నిర్వహించడానికి కావలసిన చురుకుదనం కలుగుతుంది. ఈ సమిష్టి కృషివల్ల స్నేహం, సౌహార్ద్రత్వం పెంపొందుతాయి. ఇంతే కాకుండా ప్రతిబుధవారం ఒక సినిమాప్రదర్శనకూడా ఉంటుంది. ఇందువల్ల విద్యార్థులకు విజ్ఞానవినోదాలు రెండూ లభిస్తాయి.

## సమిష్టికృషి – శ్రమదానం.

శనివారం మధ్యాహ్నం, సెలవురోజులు శ్రమదానంకోసం ప్రత్యేకించబడినయి. ఆ సమయాల్లో విద్యార్థులు, శిక్షణకేంద్రం లోపల, వెలుపలకూడా సమిష్టికృషి చేస్తారు. దీనివల్ల వారికి శ్రమదాన తత్వం బాగా తెలుస్తుంది. ఈ సమిష్టికృషిలో, మరుగుదొడ్ల నిర్మాణం, రస్తాలువేయడం, గ్రామాలను శుభ్రంచేయడం, చెరువు గట్లను బలపర్చడం కొన్ని అంశాలుమాత్రమే.

గ్రామాల్లో సంక్షేమ కార్యకలపాలు కొనసాగించేందుకు కేంద్రంలోను, సమీపంలోఉన్న నాలుగు గ్రామాలలోను సమాజ కేంద్రాలు నెలకొల్పబడినయి. వీట్లలో విద్యార్థులు జట్లుగా ప్రతి

రాత్రి 7.00 గంటలనుండి, 8.30 వరకు వయోజనులకు విద్య నేర్పుతారు. ఈ కేంద్రంనుండి, గ్రామస్థుల కవసరమయే సంగతులు వార్తలు, దినపత్రికలనుండి, ఇతర శాస్త్రీయపత్రికలనుండి గ్రహించి గ్రామాల్లో ప్రసారంచేస్తారు. కొన్ని కొన్ని గ్రామాల్లో విద్యార్థులు, అక్కడి యువకులకోసం క్లబ్బులను సైతం నెలకొల్పుతున్నారు. గోడమీద అంటించే పత్రాలద్వారా వార్తా ప్రసారంలో విద్యార్థులకు శిక్షణ యివ్వబడుతుంది. కేంద్రంలోని ప్రత్యేక కార్యకలాపాలకిది ఒకచక్కటి ప్రచారమార్గం.

## బోధనకు, ప్రదర్శనాలకు పరికరాలు.

అనేకరకముల పరికరాలతో, క్రమంగా ఒక ప్రదర్శనశాల రూపొందుతోంది. బొమ్మలు, చిత్రాలు, దేశపటాలు, నమూనాలు, కుళ్ళిపోకుండా భద్రంచేయబడిన కొన్ని క్రిములు, విత్తులు, క్రిమిసంహారాల్లోను, ఎరువుల్లోను రకాలు, వ్యవసాయంలో ఉపయోగింపబడే పరికరాలు ఈ ప్రదర్శనాలో ఎన్నో ఉన్నాయి. వివిధ రకాల మరుగుదొడ్ల నమూనాలు, పొగరానిపొయ్యి నమూనాలు, చూడవచ్చేవారి విజ్ఞానంకోసం, ఈ ప్రదర్శనశాలలో ఉంచబడినయి.

## కొత్తపథకాలు.

సాముదాయక అభివృద్ధి కార్యక్రమంయొక్క విశిష్టిత దాని నిరంతరాభివృద్ధి. ఈ కేంద్రంయొక్క కార్యకలాపాల విశిష్టతకూడా అదే.

ఈ కేంద్రంలో క్రిందచెప్పిన పథకాలు అతిత్వరలోనే అమలవుతాయి.

(1) కుటీరపరిశ్రమలశాఖలో ఒక మగన్‌వాడి ఘుణి నెలకొల్పబడుతుంది.

(2) ఉద్యానకృషిలో శిక్షణ తీవ్రతరం చేయబడుతుంది. ఇది, ప్రతి విద్యార్థికి తోటపనిముట్లు ఇవ్వడం ద్వారా, కాయకూరలను, పళ్లను, తగినవిధంగా భద్రంచేయడం ఒకచిన్న గృహపరిశ్రమగా కొనసాగించడంద్వారా, జరుగుతుంది.

(3) ఈ కేంద్రంలో ఒక దుకాణాన్ని సహకారపద్ధతులపై నెలకొల్పి నిర్వహించాలని సంకల్పింపబడుతోంది.

## 2. గోపన్నపాలెం కేంద్రం.

పశ్చిమగోదావరిజిల్లా పేరుచెప్తే, ఎవరికయినా, పచ్చటి పైరులు, బంగారంపండే భూమి, సస్యశ్యామలమైన పొలాలు గుర్తుకొస్తాయి. ఈజిల్లాలో గోపన్నపాలెం ఒక కుగ్రామం. పిల్ల, పెద్దా అంతా కలిసి నాలుగువందలమందికంటే యెక్కువ వుండరు. ఏలూరులో రైలుదిగి, అక్కడ్నుంచి జంగారెడ్డి గూడెం వేపు ఐదుమైళ్లువెళ్తే, గోపన్నపాలెం చేరుకోవచ్చు.

1948 దాకా, వూరి ఉనికికూడా ఎంతోమందికి తెలియదు. ఆ సంవత్సరంలో గ్రామ సేవకులకు శిక్షణ నిచ్చే నిమిత్తం, మద్రాసుప్రభుత్వం రాష్ట్రమంతటాకొన్ని ప్రాంతీయ శిక్షణకేంద్రాలను నెలకొల్పాలని సంకల్పించింది. ఆంధ్రప్రాంతంలో, ఆంధ్రగ్రామ సేవవిద్యాలయమనే పేరుతో ఒక కేంద్రాన్ని నెలకొల్పదలచి, అందుకు తగిన స్థానంగా గోపన్నపాలెం గ్రామాన్నెన్నుకొంది. దీనితో ఈగ్రామం మొకటిసారిగా అందరి దృష్టిలోకివచ్చింది. దీనితోపాటు నెలకొల్పబడిన మరొక కేంద్రం మధురజిల్లాలోని కల్లుపట్టివద్ద వున్నది.

1948 లో కొన్ని ఫిర్కాలలో గ్రామీణ పునర్నిర్మాణ కార్యక్రమాన్నమలుజేయడానికి మద్రాసు ప్రభుత్వం చేసినకృషి మీకందరకు గుర్తుండవచ్చును. ఈకార్యక్రమానికి ఒకరూపం కల్పించేందుకు ఒక సంఘం నియమింపబడింది. ఆ సంఘం, (అ) వ్యవసాయం, గ్రామీణ పరిశ్రమలు, (ఆ) పారిశుధ్యం, ఆరోగ్యం, గృహనిర్మాణం, (ఇ) గ్రామాలలో విద్యావ్యాప్తి, (ఈ) గ్రామాలలోను గ్రామసంస్థలను పటిష్టంచేయడం,

(ఉ) గ్రామీణసంస్కృతి, అంశాలుగా ఒక కార్యక్రమాన్ని తయారు చేసింది. ఈ విధానం ఎంతో సమగ్రమైనది. సర్వ సమన్వితమైనది. మద్రాసుప్రభుత్వంవారి ఫిర్కా-అభివృద్ధి పథకం, నాలుగు సంవత్సరాల అనంతరం అమలయిన జాతీయవిస్తరణ సేవకు నాంది అనడం సత్యదూరంకాదేమో! ఫిర్కా- అభివృద్ధి పథకంలో పనిచేస్తున్న గ్రామసేవకులలో తెలుగు తెలిసినవారికి గోపన్నపాలెం శిక్షణవసతులు కల్పిస్తుండేది.

## చరిత్రాత్మక దినం.

1952 లో దేశమంతటా సాముదాయక అభివృద్ధి కార్య క్రమం ప్రవేశపెట్టబడింది. దానితో గ్రామసేవకుని, పేరు, పాత్ర అన్నికొత్తరూపందాల్చాయి. ఈనూతన వ్యవస్థలో గ్రామసేవకుడు గ్రామస్థాయిలో కార్యకర్త అనబడేవాడు. ఎప్పుడైతే గ్రామ సేవకుని పాత్ర మారిందో అప్పుడు అతని కివ్వబడుతున్న శిక్షణ విధానాన్నికూడా మార్చక తప్పిందికాదు. నూతనమైన ఆవస రాలను తన పూర్వస్థితిలో ఈ కేంద్రం తీర్చలేకపోయింది. 1954-55 లో ఆంధ్రరాష్ట్రంలో నెలకొల్పబడనున్న జాతీయవిస్త రణ కేంద్రాల్లోను, సాముదాయక అభివృద్ధి కేంద్రాల్లోను సాముదాయక అభివృద్ధి కార్యక్రమాన్ని నిర్వహించడానికి కావల సిన గ్రామసేవకు లందరికీ శిక్షణవసతులు, 1953 లో నెలకొల్ప బడిన సామర్లకోట కేంద్రంలో సైతం లేవని తేలింది 1954 జూలైలో ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం, భారత ప్రభుత్వంయొక్క సలహాతో, గోపన్నపాలెంలోని, ఆంధ్ర గ్రామసేవక విద్యాల యాన్ని, "సింగిల్ షిఫ్ట్" విస్తరణ శిక్షణ కేంద్రంగా మార్చా లని నిశ్చయించింది.

ఆంధ్రప్రభుత్వం ఈ నిర్ణయం తీసుకొన్నరోజు గోపన్న పాలెం గ్రామచరిత్రలో ముఖ్యదినం. ఆ రోజున, ప్రథమ పంచ వర్ష ప్రణాళిక సృష్టించిన గ్రామసేవకుల అవసరాన్ని తీర్చేందుకు నెలకొల్పబడిన 43 కేంద్రాలతో పాటు, గోపన్నపాలెంకూడా భారత దేశపటంలో ఒక ప్రత్యేకస్థానా న్నాక్రమించుకొంది:

ఆంధ్ర గ్రామసేవక విద్యాలయ భవనాల్లోనే నూతన విస్తరణ శిక్షణకేంద్రం 1955 జనవరి ఒకటవ తేదీనుండి పని ప్రారంభించింది. ఈ విస్తరణ కేంద్రానికి జిల్లా వ్యవసాయాధికారి స్థాయిఉద్యోగి ప్రిన్సిపాల్‌గా నియమితులైనారు. ఈయనకు సహాయకులు ఏడుగురున్నారు. వారు ప్రజారోగ్యం, పశుసంవర్ధన, సహకారం, వ్యవసాయం వ్యవసాయక ఇంజనీరింగ్, సంఘవిద్య, గ్రామీణ పరిశ్రమలకు సంబంధించిన విషయాలు బోధిస్తుంటారు. వీరందరు తమతమ శాఖలనుండి ప్రత్యేకంగా ఎన్నుకోబడిన నిపుణులు. గ్రామసేవకుల శిక్షణ వీరికి పూర్తికాలపు ఉద్యోగం.

ప్రజారోగ్యంలో అధ్యాపకుని ఉద్యోగం రెండవ తరగతి హెల్త్ ఆఫీసర్ స్థాయినుండి మొదటి తరగతి ఉద్యోగిస్థాయికి ఉన్నతం చేయబడింది. మిగిలినవన్నీ నాన్ గెజెటెడ్ ఉద్యోగాలే. శబ్దదృశ్య బోధనాపరికరా లందగనే ఉద్యోగి నియామకం జరుగుతుంది. వ్యాయామశాస్త్రంలో అధ్యాపకుణ్ణి నియమించడం అవసరమా, కాదా అనే విషయం కేంద్రప్రభుత్వపు ఆలోచనలో ఉన్నది. వీరందరూ కాక, ఇక్కడ ఉపన్యాసాలిచ్చే నిమిత్తం, అనేక ప్రాంతాలనుండి నిపుణు లాహ్వానింప బడ్డారు.

ఈ శిక్షణ కేంద్రంయొక్క మొత్తం వైశాల్యం 17 ఎకరాలు. ప్రిన్సిపాల్, ఇంకా ఇతర అధ్యాపకులు తమకై నిర్మింప

పడిన కుటీరాల్లోనే నివసిస్తున్నారు. విద్యార్థులు 60 అడుగుల పొడుగు 15 అడుగుల వెడల్పుగల పెద్దగదులలో ఉంటారు. ఈ గదులకు తాటాకుకప్పు వేయబడింది. ఒక్కొక్క గదిలో పాతిక, యిరవై మంది విద్యార్థు లుండవచ్చును.

విద్యార్థులకు రెండు వంటయిళ్లు, భోజనశాలలు ఉన్నాయి. వంటయిళ్ళలో పొగలేని పొయ్యిలు వేయబడ్డాయి. ప్రతి విద్యార్థి వద్ద ఏదో నామమాత్రంగా ఎనిమిదణాలు పుచ్చుకొని, ప్రభుత్వం వంటసామానులను వారి కిస్తోంది. ఈ ఎనిమిదణాలు వీటిబాగుదల నిమిత్తం సేకరింప బడుతున్నాయి. ఈ కేంద్రంలో మూడుబావులు తవ్వబడినయి. వీటిలో రెండింటినుండి తీయటి నీరు లభిస్తోంది. పంటలకు, కూరగాయలకు ప్రత్యేకింపబడిన స్థలంకాకుండా, ఆటలకు, సాంస్కృతిక కార్యకలాపాలకు విశాలమైన మైదానం వున్నది. క్రమప్రకారం, కట్టినయిళ్లు, తీర్చి దిద్దినట్లుండే బాటలు, ఈ కేంద్రానికి శోభ కూరుస్తున్నవి. ప్రశాంతత ఇక్కడ రాజ్య మేలుతుంది. పల్లెటూరివంటి పరిసరాల్లో, బస్తీ సౌకర్యాలతో ఈ కేంద్రం విలసిల్లుతోంది.

## బేసిక్ వ్యవసాయశాఖ.

గ్రామస్థులకు బహుళార్థసాధకమయిన సేవ చేయడం గ్రామసేవకుని కర్తవ్యం. వ్యవసాయంలోను, పశుసంవర్ధన లోను, ప్రజారోగ్యంలోను, అభివృద్ధినాకాంక్షించే పథకాలను గ్రామంలో అమలుచేయవలసినదితడే. కాబట్టి గ్రామజీవితంలో అత్యంతసన్నిహిత సంబంధంగల వ్యవసాయం, పశుపోషణ, ప్రజారోగ్యం వంటశాఖల్లో అన్నివిషయాలు సమగ్రంగా తెలి

సిన జనహితార్థసాధక సేవకులను తయారుచేయడమే లక్ష్యంగా విస్తరణ కేంద్రాలు వ్యవహరిస్తున్నాయి. విస్తరణశిక్షణ కాల పరిమితి ఆరుమాసాలు. వ్యవసాయంలో పట్టభద్రులు, వ్యవసాయశాఖలో ఫీల్డ్ మెన్, పూర్వపు ఫిర్కా అభ్యుదయపథకంలో పనిజేసిన గ్రామసేవకులు విస్తరణశిక్షణ తరగతిలో ప్రవేశించడాని కర్హులుగా పరిగణింపబడుతున్నారు. కాని, గ్రామసేవకులుగా నియమితులయిన ఇతరులుమాత్రం ఒక సంవత్సరకాలం వ్యవసాయంలో ప్రాతిపదికవిజ్ఞానాన్నైనా పొందవలసి ఉంటుంది. గ్రామీణజీవితంలో వ్యవసాయానికున్న ప్రాధాన్యతను గుర్తించుకొని ఆలోచిస్తే, విస్తరణ విధానాల విజ్ఞానానికి, వ్యవసాయంలో ప్రాతిపదికమాత్రవిజ్ఞానమయినా పునాదిగా ఉండటం ఎంత అవసరమో తేలికగా స్పష్టమవుతుంది. 70 మంది విద్యార్థులకు వ్యవసాయంలో ప్రాతిపదికవిజ్ఞానాన్ని బోధించేటందుకు కావలసిన వసతులతో, ఒకశాఖ ఈ కేంద్రానికి చేర్చబడింది. ఈశాఖ ఆగస్టు 1, 1955 నుండి పని ప్రారంభించింది. దీని నిర్వహణ బాధ్యతను ఒక వ్యవసాయాధ్యాపకుడు, ఒక ఫీల్డ్ ఇన్‌స్ట్రక్టర్ వహిస్తున్నారు.

## వ్యవసాయక్షేత్రం.

విస్తరణ విధానాల్లో శిక్షణ వ్యవసాయశాస్త్రంలో కూలంకషమైన విజ్ఞానంపై ఆధారపడి ఉంటుంది. విద్యార్థులకు, నవీనవ్యవసాయవిధానాలతోను, పరికరాల వినియోగంలోను ప్రత్యక్షశిక్షణనిచ్చేందుకు, చుట్టుపట్లగ్రామాలకు ఆదర్శంగాను మార్గదర్శకంగాను వర్థిల్లేందుకు, ఇక్కడ ఒక వ్యవసాయక్షేత్రం నెలకొల్పబడింది. ఈక్షేత్రం రెండు వేర్వేరు భూఖండాలలో

ఉన్నది. మొదటిది శిక్షణ కేంద్రంలోనే ఉన్నది. దీని వైశా
ల్యం సుమారు ఎనిమిదెకరాలుంటుంది. రెండవ ఖండం ప్రభు
త్వేతర యాజమాన్యంలో ఉన్నది. ఇది కేంద్రానికి
ఒకమైలు దూరములో వున్నది. దీని వైశాల్యం సుమారు
పదియెకరాలదాకా ఉండవచ్చును. ఈఖండం పెదవేగి గ్రామా
నికి వెళ్లేదారిలో ఉన్నది. దీనిని 1955 జూలై 30 వ తేదీ
నుండి ఈ కేంద్రం హస్తగతంచేసుకొన్నది. వెంటనే ఈభూమిని
బాగుచేసి, పప్పుదినుసులు పండించారు. ఇక్కడ భూమిలో
మట్టి, ఇసుక, సహజమైన ఎరువులు తగుమిశ్రమంలో ఉన్నయ్.
కొంచెం శ్రద్ధవహిస్తే, పళ్లచెట్లకు, కాయకూరలపంపకానికి ఇది
ఆదర్శప్రాయమైన ప్రాంతంగా చేసుకోవచ్చును. ఉధ్యానకృషి
సమృద్ధైననీరు ముఖ్యావసరం. అందుకని ఇక్కడ పారిశ్రామిక
శాఖ వారి పర్యవేక్షణలో ఒక 'బోర్' బావి త్రవ్వబడు
తోంది.

## కుక్కుటక్షేత్రం.

భూస్వాములు భూవసతిలేని రైతుకూలీలు, వ్యవసాయ
దారులెవరైనా సరే, తమ ఆదాయాన్ని శీఘ్రగతిని వృద్ధి
చేసుకోవాలంటే కోళ్ల పెంపకం మంచిమార్గం. అందుకనే, విస్త
రణవిధానాలశిక్షణలో, మేటి పద్ధతులపై కోళ్ల పెంపకానికి ప్రత్యేక
స్థానమివ్వబడింది. గ్రామసేవకులందరికి ఈ విషయంలో తీవ్ర
తరమైనశిక్షణ యివ్వబడుతోంది. ఆంధ్రగ్రామ సేవకవిద్యా
లయంలో ఒక కుక్కుటక్షేత్రం నెలకొల్పబడటం ఈ విస్తరణ
కేంద్రానికి నిజంగా ఒక అదృష్టంగా పరిణమించింది.

అసలు గ్రామసేవక విద్యాలయంలో కుక్కుటక్షేత్రాన్ని నెల కొల్పడం, ఫిర్కా అభివృద్ధిపథకంలో కోళ్ల పెంపకాన్ని వృద్ధి చేయడం ఒక అంశంకావడంవల్ల, సంభవించింది. ఈ పథకం పశ్చిమ గోదావరిజిల్లాలోని దెందులూరుఫిర్కాలోను, మధుర జిల్లాలోని తిరుమంగళం ఫిర్కాలోను, దక్షిణ కనరాలోజిల్లా లోని కుంబ్లా ఫిర్కాలోను ప్రవేశ పెట్టబడింది. దెందులూరు ఫిర్కాకు మంజూరైన కుక్కుటక్షేత్రం, గోపన్నపాలెంలోని ఆంధ్రగ్రామసేవక విద్యాలయంలో నెలకొల్పబడింది. కోళ్ల పెంపకానికి గోపన్నపాలెం ఏమంత ఆదర్శప్రాయమయిన ప్రాంతంకాదు. ఇక్కడ నేల చాలా పల్లం. వానాకాల మంతాకూడా ఈనేల చెమ్మగానే ఉంటుంది. కాని ఎక్కడ దృఢ నిశ్చయం ఉంటుందో అక్కడ అవాంతరాలన్నీ వాటంతటనే తొలగిపోతయి. అవిరామకృషి ఫలితంగా ఇక్కడ ఒక చక్కటి కుక్కుట క్షేత్రాన్ని రూపొందించడం సాధ్యమయింది. 1-4-56న ఇదివరకేవున్న 'పౌల్ట్రీ యూనిట్'నుకూడా, ఈ క్షేత్రంతో కలిపి వేయడం జరిగింది. 1951-52 లో ఇక్కడ 8 'పుల్లెట్లు', 33 "రోడ్ ఐలాండ్ రెడ్" పుంజులుమాత్రం ఉండేవి. 1956 మార్చి నాటికి 46 పెట్టలు, 8 పుంజులు, 21 'పులెట్లు' 157 కోడిపిల్లలు ఉన్నాయి. 1955-56 లో ఇక్కడ గ్రుడ్లసంఖ్య 5,079. వీటిలో 1,674, గ్రుడ్లను, రైతులు కొనుక్కొని పొది గించారు. ఈకేంద్రంయొక్క కార్యకలాపాలలో ఇది ఒక ప్రశంస నీయాంశం. ఈ కాలంలోనే 52 పుంజులు, 41 పెట్టలు, 'పులెట్లు' ప్రజలకు పంచియివ్వబడ్డాయి. ఈ కేంద్రంలో ప్రతికోడీ, సంవత్స రానికి సగటున 149 గ్రుడ్లు పెట్టినట్లు అంచనా వేయబడింది.

'రోడ్ఐలాండ్ రెడ్' జాతికిచెందిన కోళ్లు సగటున ఏడాదికి 160 నుండి 180 దాకా గుడ్లు పెడుతాయి. ఈ కుక్కుట క్షేత్రానికి కావలసిన పనినంతా ఒక 'పౌల్ట్రీఫీల్డ్ మెన్' ఒక మేస్త్రీ, ఒక కుట్టువాడు ఒక జవానుచేస్తుంటారు. ఈ క్షేత్రం పశుసంవర్ధనను బోధించే అధ్యాపకుని యాజమాన్యంక్రింద ఉంటుంది.

## గ్రామీణ పరిశ్రమలకు నమూనా కేంద్రం.

మన ఆర్థికవ్యవస్థలో గ్రామీణ పరిశ్రమలకున్న ప్రముఖ స్థానాన్నెవరు కాదనలేరు అభ్యుదయ పథకాలన్నింట్లోను, ప్రణాళిక నిర్ణాయకసంఘం, గ్రామీణ పరిశ్రమలకు ప్రత్యేకమైన ప్రాముఖ్యత నిచ్చింది. ఆంధ్రదేశంలో ఏకైకమైన గ్రామీణ పరిశ్రమల నమూనా కేంద్రాన్ని కలిగిఉండటం' నిజంగా ఈ విస్తరణ కేంద్రంయొక్క అదృష్టం. ఈ నమూనా కేంద్రం 1951లో నెలకొల్పబడింది. గ్రామంలో వృత్తికారులకు నవీన విధానాల్లో శిక్షణయివ్వడం, నవీనవిధానాల ఉపయోగాన్ని, ప్రత్యక్ష ప్రదర్శనలద్వారా ఋజువుచేయటం, ఈ కేంద్రంయొక్క ఆశయాలు. గ్రామీణ పరిశ్రమలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించడం, పరిశోధనలు జరపడం, వీటికి సంబంధించిన పుస్తకాలు ప్రచురించడంకూడా ఈ కేంద్రంయొక్క పనులలో కొన్ని 1951 నుండి 54 వరకు మూడేళ్లకాలంలో 71 మంది వృత్తికారులకు ఈ కేంద్రంలో శిక్షణయివ్వబడింది. ఈ నమూన కేంద్రంలో దిగువ పరిశ్రమలలో శిక్షణ వసతులున్నాయి.

(1) వార్ధా, గానుగలు, కొత్తరకపుగానుగలులో నూనె పింపటం.

(2) కాగితాల పరిశ్రమ.

(3) పిండి, విసరడం, వడ్లు దంపడం. ఇవి నూతనపద్ధతులలో జరుగుతాయి.

(4) తాటిబెల్లం, పంచదార పరిశ్రమలు.

(5) బిస్కట్ల తయారు.

(6) కుమ్మరం. 'మగన్' పొయ్యి తయారుచేయడంతో సహా.

(7) సబ్బులు తయారుచేయడం.

(8) తేనె తీయడం.

(9) తాళ్లు పేనడం.

(10) ఇటికలు చేయడం.

పైన పేర్కొన్న గ్రామీణ పరిశ్రమల నిర్వహణ కవసరమయే పరికరాలనుకూడా ఈ కేంద్రం తయారుచేస్తుంది. 1955–56 లో వార్ధాగానుగలు 1?, ఒక క్రొత్తరకపుగానుగ, వడ్లదంపకానికి రెండు 'చక్కీలు', పిండి విసరడానికి తొమ్మిది 'చక్కీలు', నూటయేడు మగన్ చూలాలు తయారుచేయబడి రాష్ట్రంలోని వివిధప్రాంతాలకు పంపబడ్డాయి. ఇదేకాలంలో 6,988 పౌనుల మంచినూనె, కొబ్బరినూనె ఇక్కడ గానుగల్లో పిండటంజరిగింది. 20 రీముల బ్లాటింగ్ కాగితం, ఇతర రకాల కాగితం 20 రీములుకూడా ఇక్కడ తయారైనై. 263 పౌనుల సబ్బు, 467 పౌనుల బిస్కట్లు, 261 పౌనుల తాటిబెల్లం, 4 పౌనుల తాటి చక్కెర 1,952 గజాలతాళ్లు, 6,100 ఇటికలు తయారుచేయబడ్డాయి. ఇక్కడ గానుగలలోతీసిన నూనెకు వాడకం బాగా

పెరిగిపోయింది. ఈ కేంద్రంయొక్క వివిధ కార్యకలాపాలు ప్రజా బాహుళ్యంలో విశేషప్రచారం పొందుతున్నాయి.

ఈ నమూనా కేంద్ర నిర్వహణకు ఒక ప్రత్యేక శిబ్బంది ఉన్నది. ఈ సిబ్బందివర్గంలో ఒక సూపరింటెండెంట్, ఇద్దరు అధ్యాపకులు (వీరు వ్యవస్థాపకులుగాకూడా వ్యవహరిస్తారు,) ఒక సహాయక సూపరింటెండెంట్, ఒక కుమ్మరి, ఇద్దరు వడ్రంగులు, ఒక కమ్మరి, పదిమంది సహాయకులు, వీరిపై పెత్తన దారిగా ఒక మేనేజర్, ఉన్నారు. దీనికి స్థానికఅధికారి, కేంద్రం యొక్క ప్రిన్సిపాల్. కాని, ఆంధ్రప్రభుత్వ పారిశ్రామిక, వాణిజ్యశాఖా దర్శకుని పర్యవేక్షణలోనే ఉంటుంది. ఈకేంద్రంలో మేనేజర్, కేంద్రానికి సంబంధించిన అనేకపనులను చక్కబెట్టడమే కాకుండా, విస్తరణ విద్యార్థులకు, కుటీరపరిశ్రమలలో శిక్షణ నిస్తాడు. ఈ విధంగా వారికి ఈ కేంద్రంలో నిర్వహింపబడుతున్న గ్రామీణ పరిశ్రమలలో ప్రత్యక్షానుభవం లభిస్తుంది. వాటి లోటుపాట్లన్నీ క్షుణ్ణంగా తెలుస్తాయి. ఈ పరిశ్రమలకు సంబంధించిన విజ్ఞానమంతా వారికాళింపవుతుంది. గ్రామసేవకులుగా వారు తమ తమ ఉద్యోగాల్లోకి ప్రవేశించిన తర్వాత, ప్రజా బహుళ్యంలో గ్రామీణ పరిశ్రమలపట్ల గౌరవం, ఉత్సాహం చిగురింపజేస్తారని, మనవిస్తృత ఆర్థికవ్యవస్థలో గ్రామీణ పరిశ్రమలకు అనాదినుండి ఉంటూవచ్చిన్న ప్రాభవాన్ని తిరిగి సంక్రమింపజేస్తారనీ ఆశించవచ్చును.

## దినచర్య.

విద్యార్థుల ఆచరణ నిమిత్తం తయారు చేయబడిన అను దిన కార్యక్రమం కేవలం పాఠాలతో సమాప్తంకాదు. ఈకార్య

క్రమంలో రోజులోని యిరవై నాలుగు గంటలూ చేర్చబడినాయి. ఏ అనుభవంలేని కొత్తవిద్యార్థులను, ఈ శిక్షణ కాలంలో ఆత్మ నిగ్రహంగల గ్రామసేవకులనుగా తయారు చేయడమే ఈకార్య క్రమంయొక్క లక్ష్యం. ఈ కేంద్రంలో పొద్దున ఐదుగంటలకు దినం ప్రారంభమవుతుంది. అప్పుడు ఒకగంట విద్యార్థులను మేల్కొల్పుతుంది. 5.30 అయేసరికి విద్యార్థులందరూ జట్లుగా విడిపోయి కేంద్రాన్ని పరిసరాలను శుభ్రంచేస్తారు. 6.30 కు పతాక స్తంభంవద్ద గుమికూడి ప్రార్థన సల్పుతారు. ప్రార్థనలో, 'వందేమాతరం' "జండా ఊంఛా రహే హమారా" వంటి జాతీయ గీతాలను బృందగానం చేస్తారు. ప్రార్థనఅయిన వెంటనే పలహారం తీసుకొంటారు. తదనంతరం బేసిక్ విద్యార్థులు ప్రదర్శనా తరగతులకు, విస్తరణ విద్యార్థులు ఉపన్యాస తరగతులకు వెళ్ళి పోతారు. ముందుచెప్పిన తరగతులు నాలుగు గంటల కాలము, వెనుక పేర్కొన్న తరగతులు మూడుగంటల కాలమూ కొన సాగుతాయి. 12 గంటలకు విద్యార్థులందరూ సహపంక్తిని భోజన మారగిస్తారు. వడ్డన విద్యార్థులే చేసుకొంటారు. భోజనానంతరం తమ కంచాలను తామే కడుక్కొంటారు. ఒంటిగంటనుండి రెండు గంటలదాకా వార్తాపత్రికలు చదువుకొంటారు. 2.30 కు విస్తరణ విద్యార్థులు నిదర్శనా సహితమయిన తరగతులకు, బేసిక్ విద్యా ర్థులు నిదర్శనారహిత తరగతులకు వెళ్లిపోతారు. 6.15కు విద్యార్థు లందరూ ధ్వజస్తంభం చుట్టూచేరి, "జనగణమన" పాడతారు. రాత్రి భోజనమైన తర్వాత విద్యార్థులందరూ జట్లుజట్లుగా విడి పోయి, విస్తరణకు సంబంధించిన విషయాలను చర్చిస్తారు. అప్పు డప్పుడు వినోద కార్యక్రమాలు నడుపుకొంటారు. ఇందుకు

కావలసిన సాధనసామగ్రి అంతా ఈ కేంద్రంలో లభ్యమవుతుంది. గాంధీ సూత్రాలను విద్యార్థుల్లో ప్రచారం చేసేందుకు, వారు క్రమబద్ధమైన జీవిత విధానాన్ని అలవరచుకోడానికి కావలసిన దోహదం కల్పించేందుకు, అనుదినం, ప్రాతఃకాల ప్రార్థనానంతరం కొంతసేపు విద్యార్థు లందరిచేతా రాట్నాలమీద నూలువడికించాలని సంకల్పింప బడుతోంది.

## ఉద్యోగంకోసం శిక్షణ.

ప్రాథమిక వ్యవసాయ శిక్షణ తరగతులలో ఆచరింప బడుతున్న పాఠ్యక్రమం, విద్యార్థు లందరికి వ్యవసాయంలోను పశుసంవర్ధనలోను కూలంకషమైన విజ్ఞాన మివ్వడమే ప్రధానోద్దేశంగా తయారయింది. ఇక విస్తరణ శిక్షణలో అవలంబింపబడుతున్న పాఠ్యక్రమం. గ్రామసేవకుని సకలార్థ సాధకునిగాను, గ్రామీణ జీవితంలోని ప్రతిరంగంలోని అభ్యుదయ సాధనకు సమర్థునిగాను, చేయడానికే ఉద్దేశింప బడింది. కాని శిక్షణకాలం మొదటినుండి చివరివరకు, వీరికి నేర్పబడే శాస్త్రీయ విజ్ఞానం యొక్క ఆచరణ యోగ్యతకే యెక్కువ ప్రాధాన్య మివ్వబడుతుంది.

విస్తరణ శిక్షణ ఏకొన్ని విషయాల విజ్ఞానంమీద మాత్రమో ఆధారపడి లేదు. దీనికాధారభూతమయిన సూత్రాలు కొన్ని ఉన్నాయి. ఈ శిక్షణకు కొన్నిలక్ష్యాలుకూడా ఉన్నాయి. ఆ లక్ష్యా లన్నింటిని సాధించడం, పాఠశాలలలో, ఉపన్యాసాలవల్ల జరగదు. లేబొరేటరీలలో ప్రయోగాలద్వారా, పుస్తకాలద్వారా ఈ శిక్షణకు ఆశయసిద్ధి సంప్రాప్తించదు. దీనిని పొందినవారు

దానివల్ల వారుపొందిన ప్రయోజనాలను, గ్రామంలోని గృహా ల్లోను, వీథుల్లోను, పొలాల్లోను ఉపయోగించ గలిగినప్పుడే ఈ శిక్షణకు ఆశయశిద్ధి లభిస్తుంది. ఆ రోజునే, ఈ శిక్షణ సఫలీ కృత మవుతుంది. ఈ శిక్షణయొక్క ప్రయోజనం పూర్తవు తుంది.

అందుకనే గోపన్నపాలెం కేంద్రంలోని ప్రతివిద్యార్థి కనీసం రెండు కుటుంబాల అభ్యుదయ భారాన్ని తీసుకోవాలి. ఈ కుటుంబాలు, కేంద్రానికి మూడు నాలుగుమైళ్ల దూరంలో వున్న ఆరుగ్రామాల్లో ఏఒక దాంట్లోనయినా ఉండవచ్చును. తాము నేర్చుకొన్న ప్రతివిషయంలోను, వీరిక్కడ ప్రత్యక్ష ఫలి తాలను సాధించాలి. ఇక్కడ వీరికి తొలిఅనుభవాలు లభిస్తాయి. ముందున్న జీవితాన్ని మొదటిసారిగా చవిచూస్తారు. వారునేర్చు కొన్న వివిధవిధానాల నిప్పుడే ప్రయోగించి పరిశీలిస్తారు. ఒక విధంగాచూస్తే విస్తరణ విద్యాబోధనేనేమో అన్పిస్తుంది. కాబట్టి విస్తరణ విద్యార్థి ప్రతిఒకడూ మంచి అధ్యాపకుడుగాకూడా ఉండటం అవసరం. కాని ఈ విద్యార్థికి బలవంతంగా పాఠాలు బోధించడంలో నమ్మకంలేదు. తన హయాంలో ఉన్న కుటుం బాలవారికి నవీనవిధానా లెంత లాభదాయకమైనవో అనేకవిధాల తెలియజేస్తాడు. తెలియజేసి వారిచేత, వాటి నాచరింప జేస్తాడు. విస్తరణ విద్యార్థి బహుళార్థసాధకుడు. గ్రామస్థుల జీవితాలతో అత్యంత సన్నిహితసంబంధంకల విషయాలెన్నో ఇతనికి నేర్ప బడ్డాయి. కర్షకకుటుంబాలను వేధిస్తున్న ముఖ్యసమస్య లన్నిటి తోను, ఇతడచిరకాలంలోనే పరిచయం కల్పించుకొంటాడు. వారిభావాలను, అభిప్రాయాలను, వారి ఆశలను, ఆశయాలను,

వారి సంస్కృతిని, సంప్రదాయాలను, వారి ఆచార్య వ్యవహారాలను ఇతడు తెలుసుకొంటాడు. వాటి కనుగుణంగా తనవిధానాలను రూపొందించుకొంటాడు. గ్రామస్థుల నేవిధంగానూ నొప్పించకుండా వ్యవహరిస్తాడు. చూస్తుండగానే, గ్రామస్థులకు స్నేహపాత్రుడూ, విశ్వాసపాత్రుడు అవుతాడు. ఆకుటుంబంలోనే ఒకడయిపోతాడంటే ఆశ్చర్యపడ నక్కరలేదేమో. సేవాతత్పరతను, త్యాగనిరతిని తనలో పెంపొందించుకోడానికి, ప్రతివిద్యార్థి నిరంతరం కృషిస్తాడు. అతనిని చూసినవారందరికీ, తాము ఒకగొప్ప దేశంయొక్క పౌరులమనే భావంకలిగి, స్వీయాభివృద్ధి సాధనలో తమకూ కొంతబాధ్యత ఉన్నదనే విజ్ఞానంకలిగే విధంగా అతను నడచుకొంటాడు. ఆచరణే ఉదాహరణగా వ్యక్తి, సమిష్టి జీవితాలను బాగుచేసుకోవడంలో వ్యక్తి సమిష్టి కృషికున్న ప్రాముఖ్యాన్ని గ్రామస్థులందరికి తెలియజేస్తాడు. గ్రామస్థులకు కంపోస్టు తయారీలోను, ఎరువుగోతులను కప్పివేయడంలోను పశువులకొట్టాలను శుభ్రంచేయడంలోను ఇతను సాయపడుతుంటాడు. గ్రామస్థుల పొలాల్లో ప్రదర్శననిమిత్తం పంటలు నాటుతాడు. భారత, అమెరికా ఆపరేషనల్ ఒప్పందంక్రింద లభ్యమయే ఎరువులను ఇక్కడ ప్రయోగిస్తాడు. పంటల ఉత్పత్తిపై ఎరువులప్రభావాన్ని చూసి నేర్చుకొంటాడు.

గ్రామస్థులకు జపాన్ వరిసాగుపద్ధతిని ప్రదర్శిస్తాడు. పంటల సాగులో నవీన విధానాలను తెలియజేస్తాడు. పశువుల ఆరోగ్యం కాపాడే నిమిత్తం, వాటి కెటువంటి అంటువ్యాధులు సోకకుండా ఒక అధ్యాపకుని పర్యవేక్షణలో టీకాలు పొడుస్తాడు. కోళ్లను కూడా ఇతడేవిధంగా వ్యాధులబారిని పడకుండా కాపాడు

తాడు. నానుడుగోతులు త్రవ్వి, మురికి గోతులనుపూడ్చి గ్రామస్థుల గృహాలను ప్రాంగణాలను శుభ్రంగా ఉంచేందుకు సాయపడ్తాడు. మసూచికంవంటి వ్యాధుల నివారణకు, తీసుకోవలసిన చర్యలన్నీ ఇతనికి నేర్పబడుతయి. అతను ప్రజారోగ్య అధ్యాపకుని పర్యవేక్షణలో, పిన్నలకు, పెద్దలకు టీకాలు సకాలంలో పొడుస్తాడు. వయోజన విద్యాకేంద్రాలనే విధంగా నిర్వహించాలో తెలుసుకొనేందుకు, ఇతడు మరికొందరితోకలిసి ఒకవయోజన విద్యాకేంద్రాన్ని నడుపుతాడు. ఇక్కడ ప్రతిరాత్రి గ్రామంలోని వయోజనులందరూచేరి, తమ పాఠాలను నేర్చుకొంటారు. 'మగన్' పొయ్యినిర్మాణంకూడా అతనికి శిక్షణలో నేర్పబడుతుంది. అతడు నేర్చుకొన్నదానిని ఆచరించే అవకాశంకూడా గ్రామస్థులవంటయిళ్లలోనే లభిస్తుంది. ఈ విధంగా తమ తమ బాధ్యతలను అణుమాత్రమయినా చలించకుండా సమర్థనీయంగా నిర్వహించడానికి కావలసిన శిక్షణఅంతా వీరికి ఇవ్వబడుతున్నది. 1955-56 లో శిక్షణ పొందుతూ విద్యార్థులెంత విస్తరణ సేవ చేసారో ఒక్కసారి చూడండి.

| క్రమం | పని వివరాలు | పని మొత్తం. |
|---|---|---|
| | I వ్యవసాయం. | |
| 1. | కంపోస్టు గోతుల త్రవ్వకం | 78 |
| 2. | తయారయిన కంపోస్టు | 99 టన్నులు |
| 3. | కప్పివేసిన ఎరువు గోతులు | 82 |
| 4. | పశుమూత్రానికి నిలవ సౌకర్యంతో నిర్మింపబడిన పశువుల కొట్టాలు | 55 |

5. పంచిపెట్టబడిన రసాయనికవు యెరువులు

| | |
|---|---|
| (అ) సూపర్ ఫాస్ఫేట్ | 137 మణుగులు |
| (ఆ) అమ్మోనియం సల్ఫేట్ | 131 మణుగులు |
| (ఇ) అమ్మోనియం సల్ఫేట్-నైట్రేట్ | 137 మణుగులు |
| (ఈ) యూరియా | 34 మణుగులు |

6. ఎరువుల ప్రదర్శనజరిగిన స్థలాలు 585

7. నాటబడిన మొక్కలు 113

8. జపాను పరిసాగు 8 ఎకరాలు

9. క్రిమిసంహారాదులు వెదజల్లబడినకాయ కూరల తోటలు, పళ్లతోటలు 6 ఎకరాలు

## II. పశుసంవర్ధన.

1. చిన్న చిన్న గాయాలకు వైద్యంపొందిన పశువులు 28
2. అంటువ్యాధులు సోకకుండా టీకాలివ్వబడిన పశువులు 302
3. కాస్ట్రేట్ చేయబడిన పశువులు 3
4. రాణిఖెట్ వ్యాధినుండి రక్షణనిమిత్తం టీకాలివ్వబడిన పక్షులు 571

## III ప్రజారోగ్యం.

(1) క్లోరిన్ ప్రయోగింపబడిన బావులు 6

(2) ఇళ్ళలో మరుగుదొడ్ల నిర్మాణం 3

(3) స్నానపుగోతులు 10

(4) అనారోగ్యకరమయిన గోతులపూడిక 53

(5) మసూచికం రాకుండా టీకాలుపొందిన వారు 300

(6) శుభ్రంచేయబడిన బావులు 6

IV సహకారం, పంచాయతీలు.

1. పునఃస్థాపింపబడిన సహకార సంఘాలు 1

2. కొత్తగా చేరినసభ్యులు 10

3. సేకరింపబడిన పెట్టుబడి రూ 60

4. మంజూరయిన ఋణములు 18

5. ఋణములకు మంజూరయి, ఇచ్చివేయబడిన మొత్తం రూ 2,100

V వయోజనవిద్య, సాంఘికవిద్య.

(1) ప్రచారక సభలు 10

(2) నెలకొల్పబడి, నిర్వహింపబడుతున్న వయోజన విద్యాకేంద్రాలు. 2

(3) హరికథలు, బుర్రకథలు 12

VI కుటీరపరిశ్రమలు.

1. పరిశ్రమగా వర్ధదంపకం ప్రవేశ పెట్టబడిన గ్రామములు 12

2. 'మగన్' పొయ్యిలనిర్మాణం 16

# కాళహస్తి కేంద్రం.

కాళహస్తి కావడానికి చిన్నపట్నమేగాని, దాని పేరు విననివారంటూ ఉండరు. ఈ నగరంలో జనాభా ఏమంత ఎక్కువగా లేకపోయినా ఈ క్షేత్రంయొక్క యొక్క చరిత్రమటుకు చాలా పెద్దది. కాళహస్తీశ్వరస్వామి ఆలయం చెంతనే మన రాష్ట్రంలోని మూడవవిస్తరణశిక్షణ కేంద్రం నెలకొల్పబడింది. ఇది మూడవది, ఆఖరుదికూడాను.

అసలెట్లా మొదలయిందంటే.........

1955 ఆగస్టు ఒకటవ తేది, సూర్యోదయం కావస్తోంది. కాళహస్తీరాజుగారికి చెందిన 'కాసా' తోటలో నూటయాభై మంది విద్యార్థులు గుమికూడారు. ఉజ్వలమైన భావికార్య క్రమానికి వారిని సన్నద్ధులనుచేయడం, రాష్ట్రంలో గ్రామోద్ధరణను నిరాటంకంగా కొనసాగించడానికి అవసరమయ్యే బహుళార్థ సాధకులనుగా వీరిని తయారుచేయడం ఆరోజునుండే ప్రారంభించాలని సంకల్పింపబడింది. విద్యార్థులందరూ సమావేశమైన ఆ ప్రాంతాన్ని తోటకన్నా అడవియనడం మంచిదేమో. 25 ఎకరాల మైదానం. అక్కడక్కడ శిధిలమయిన ఇక్ష్వాకులనాటి భవనలు. ఎక్కడ చూసినా రాళ్లగుట్టలు. రాయి కదిపితే పాములు, తేళ్లు, చుట్టుపట్లఎక్కడా మనుష్యసంచారమ యినా లేదు. కాని ఈ పరిస్థితి విద్యార్థులలోను అధ్యాపకులలోను యేమాత్రం భయం కలిగించలేదు. తాటాకులచాపనొకదానిని పరచుకొని, దానిమీదనే అందరూ కూర్చొన్నారు. తక్షణం చేయవలసిన పనులేమిటా అని ఆలోచించారు. ఈ ప్రదేశాన్ని వానయో

గ్యంగా చేయడానికి వీరుచేసినప్రయత్నం అట్టడుగునుండి నిర్మిత మవుతున్న నవభారతానికి సంకేతం. కాళహస్తిఊరికావల, చూస్తేనే వళ్లుగగుర్పొడిచే ఒక భవనంలో, 1955 ఆగస్టు ఒక టవరోజున, కాళహస్తి డబుల్‌షిఫ్ట్ విస్తరణ శిక్షణకేంద్రం ప్రారంభోత్సవం జరుపుకొంది.

కాని ఈ ప్రదేశమంతా క్రమంగా మారిపోయింది. విత్తు వేస్తే మొలవని ఈప్రదేశం, రకరకాలచెట్లతో ఎంతో అందం గాను చూడ ముచ్చటగాను తయారయింది. కొద్దిరోజులక్రిందనే ఒక్కసారిచూస్తే ఇకచాలనిపించే యీప్రదేశం, మళ్లీ, మళ్లీ చూడాలనిపించేటట్లు ఎంతో ఆకర్షణీయంగా తయారయింది. రాష్ట్రప్రభుత్వం, తన డెవలప్‌మెంట్ కమీషనర్‌ద్వారా ఈ కేంద్రంపై అజమాయిషీ వహిస్తూంది. చిత్తూరుజిల్లా కలెక్టర్ పరిపాలనా పరిధిలో ఈకేంద్రం ఉన్నది. మనదేశంలో మిగిలిన అన్నిశిక్షణకేంద్రాలమీద వలనే, దీనిమీదకూడా కేంద్రప్రభుత్వ వ్యవసాయశాఖలోని విస్తరణ విభాగం పర్యవేక్షణ చేస్తూంది.

ఈ కేంద్రంలో నూతన భవనాలు కొన్ని అతి త్వరలోనే వెలిశాయి. ఇవి కాళహస్తిరైల్వుస్టేషనుకు మూడుమైళ్ళదూరంలో ఉన్నాయ్. భవనాలవెనక, ఒక 15 ఎకరాలవ్యవసాయక్షేత్రం ఒక కుక్కుటక్షేత్రం ఈప్రదేశాన్ని సమతలంచేసి, సేద్యయోగ్యం చేయడానికి యెద్దులను, బుల్‌డోజర్లను ఉపయోగించవలసి వచ్చింది. ఈకృషిలో విద్యార్థులందరికీ ప్రత్యక్షానుభవం కావల సినంత లభించింది. ఈ కేంద్రంలో 50 మంది విద్యార్థులతో ఒక బేసిక్ వ్యవసాయ విభాగంకూడా నెలకొల్పబడింది. ఈ కేంద్రానికి వెలుపల, ఉత్తరంగాను, పశ్చిమంగాను, హరిజనులు, సాలెవారు

నివాసం యేర్పరచుకొన్నారు. ఆకాశాన్నంటే గుడిగోపురం, స్వచ్ఛమైన నీటితో సరోవరం, ఈ కేంద్రంయొక్క శోభను ఇనుమడింపజేస్తున్నాయి. దానికొక కొత్త అందాన్ని చేకురుస్తున్నాయి.

## శిక్షణ విధానం.

నూతన విజ్ఞానసముపార్జన పాఠశాలగదులలో చర్చలద్వారా జరుగుతుంది. పాఠ్యగ్రంథాలు, పరీక్షలు ఉండవు. విద్యార్థులచేతుల్లో పుస్తకాలకన్నా పారలను, పలుగులను నాగళ్ళను, చీపుర్లను, బుట్టలనే యెక్కువగా చూడవచ్చును.

విద్యార్థులు, బాధ్యతాయుతమైన జీవితాన్ని, చొరవను అలవరచుకొంటారు. పరస్పరగౌరవంతో, స్వయంకృషితో, ప్రజాస్వామ్యపుసూత్రాల ప్రకారం జీవితంగడుపుతారు. విద్యార్థులతో అధ్యాపకుల సంబంధాలలోకూడా యీ ప్రజాస్వామ్యం ప్రతిబింబించడానికి కృషి జరుగుతుంది.

ప్రిన్సిపాల్, ఇతర అధ్యాపకులు, విద్యార్థులు అందరు గ్రామీణాభివృద్ధిలో సహచరులై మెలగుతారు. విద్యార్థులందర్లు కలిసి మెలిసి ఒకే కుటుంబంగా వ్యవహరిస్తారు. ఈ కుటుంబంలో విభేదాలకు తావులేదు. విపక్షణ లీజోలికేరావు. కాళహస్తిలో యివ్వబడే శిక్షణకు, మిగిలిన కేంద్రాలలో విద్యార్థులకు లభించే శిక్షణకు ఎక్కువ తేడాలేదు. ఇక్కడకూడా గ్రామీణవిస్తరణ అనే సకలార్థ సాధకకృషికి విద్యార్థులను తయారు చేయడమే లక్ష్యం. ఇక్కడ వ్యవసాయంలోను, ఉద్యానకృషిలోను, విద్యలోను పశువైద్యంలోను విస్తరణ విధానాలను విద్యార్థులు నేర్చుకొంటారు. గృహనిర్మాణం, రోడ్లువేయడం, బావులు తవ్వడం,

సహకార సంస్థలకు సంబంధించిన విషయాలు, పారిశుధ్యం మొదలయిన వాటిని గురించికూడా నేర్చుకొంటారు.

పుట్టినికెలికేచేయి అవమానకారణం కాదనే విషయం విద్యార్థులు ఇక్కడ తెలుసుకొంటారు. పాఠశాలలలో వాతావరణంలో ఎటువంటి పట్టింపులు కానరావు. స్వేచ్ఛ, సహృదయత అతిశయిస్తుంటయ్. ఈ వాతావరణంలో రేపు తమఉద్యోగంలో అవసరమయే విజ్ఞానాన్ని విద్యార్థు లాకళింపుచేసుకొంటారు. శిక్షణ సమస్యల పరిష్కారానికి తగిఉంటుంది. విద్యార్థులు ముందునుందు చేయవలసిన ఉద్యోగంలో ఎంతో ఉపయోగకారిగా ఉంటుంది. కాబట్టి శిక్షణ విధానాన్ని అధ్యాపకు లెంతో అలోచనతో, విచక్షణతో పొందిస్తారు. విద్యార్థులు ఏకచిత్తతతో అత్యంత శ్రద్ధాశక్తులతో దాని ననుసరిస్తారు. ఇక్కడ నేర్పబడే విషయాలు, గ్రామస్థుల జీవితంతోను, వారి సమస్యలతోను గ్రామీణాభివృద్ధితోను సన్నిహితసంబంధం కలిగుంటాయి, విద్యార్థులందరూ, తమ పాఠ్యక్రమంతోపాటు, పుస్తక భాండారంలోని పుస్తకాలను, కమ్యూనిటీ ప్రాజెక్టుల పరిపాలనవ్యవస్థ, భారత వ్యవసాయ పరిశోధనా సమితివారి ప్రచురణలను చదివి, తమ విజ్ఞానాన్ని పరిపూర్ణం చేసుకొంటారు. ఇక్కడ పరీక్షలు కేవలం, సమస్యలను పరిశీలించి, వాటి పరిష్కార మార్గాలను కనుగొనడానికి విద్యార్థులకున్న శక్తిని పరీక్షించేందుకే జరుగుతయ్.

## వ్యవసాయం.

గ్రామీణాభివృద్ధి, నవీన వ్యవసాయ విధానాల ఆచరణ మీద, వ్యవసాయోత్పత్తి నధికంచేయడంమీద ఆధారపడివుండ

టాన, ఇక్కడ పాఠ్యక్రమంలో వ్యవసాయానికి ముఖ్యస్థానమివ్వ బడింది.

వ్యవసాయబోధన మొక్కల సంరక్షణమీద, కాయ కూరలు, పళ్ళచెట్ల పెంపకంమీద కేంద్రీకరింపబడింది. చేసి తెలుసుకొనడానికి ఇక్కడ వసతులు క్రమంగా అధికం చేయబడు తున్నయ్. విద్యార్థులు కాయకూరల పెంపకం నేర్చుకొంటున్నారు. వారు పండించే కాయకూరలు, వారి భోజనావసరాలను తీరుస్తు న్నయ్. మామూలుగా పంటలరక్షణకు కాలానుగుణంగా అనేక మార్గాలున్నప్పటికీ, క్రిమిహారాదులను నల్లి వాటిని సంరక్షిం చటం ఇప్పుడిప్పుడు విరివిగా అమలవుతోంది. కాబట్టి విద్యార్థు లందరకూ ఈ విధానాలలో శిక్షణ యివ్వబడుతోంది.

## వ్యవసాయిక ఇంజినీరింగ్.

15 ఎకరాల వ్యవసాయక్షేత్రానికి అవసరమయిన నీటిని తోడిపోసేందుకు, విద్యార్థుల సాయంతో ఒక నూనెఇంజెను, ఒక పంపు నెలకొల్పబడినయి. 6 ఎకరాల పట్టను, వ్యవసాయశాఖ వారి బుల్‌డోజర్‌తో, విద్యార్థుల సహాయంతో, సేద్యయోగ్యం చేశారు. క్షేత్రంలోపల వెలుపలకూడా బాటలు వేశారు. నవీన పద్ధతులపై గృహనిర్మాణం, మితవ్యయంతో సాధ్యమయే గృహముల నిర్మాణంకూడా జరుగుతోంది. గ్రామీణ పథకాల రచనను నిర్వహణనుకూడా విద్యార్థులు విపులంగా తెలుసుకొం టారు. పొగరాని పొయ్యి, పొగనిలవని వంటిల్లుకూడా వీరే విధంగా కట్టాలో నేర్చుకొంటున్నారు. నవీన వ్యవసాయ పరిక రాలవాడకం, అవి చెడిపోకుండా ఉంచుకోవడం, చెడిపోతే బాగు

చేసుకోవడం, ఇవన్నికూడా విద్యార్థులకు ప్రదర్శనలద్వారా తెలియజేస్తారు. దాపునవున్న పొలాలకు విద్యార్థులు వెళ్ళి అక్కడ జరిగే పనిని చూస్తారు. అప్పుడప్పు డందులో పాల్గొం టారు.

## పశుసంవర్ధన.

రాష్ట్రీయ పశువైద్యశాలలో విద్యార్థులకు పశుజాతిని బాగుచేసే విధానాలన్నీ ప్రత్యక్ష ప్రదర్శనలద్వారా నేర్పుతారు. పశువులకు టీకాలువేయడం. వాటికివచ్చే సామాన్య రోగాలను నయంచేయడంకూడా ప్రదర్శనలద్వారా నేర్చుకొంటారు. ఇక్కడే ఉన్న కుక్కుటక్షేత్రంలో విద్యార్థులు కోళ్ళపెంపకంలో అనేక విషయాలు అనుభవంవల్ల తెలుసుకొంటారు.

## ప్రజారోగ్యం.

ఈ విషయంలో వీరికి లభించే శిక్షణ గ్రామాల నెదు ర్కొంటున్న ఆరోగ్య పారిశుద్ధ్య సమస్యల పరిష్కారానికి పరిమిత మయి వుంటుంది. శారీరక శుభ్రత, పరిసరాల పారిశుద్ధ్యం, అంటు వ్యాధులు, ఆహారశాస్త్రం, ప్రధమచికిత్స, సాధారణ వ్యాధులు, వాటి చికిత్స, మాతాశిశు సంరక్షణ, కుటుంబ పరిమితి ఇవన్నీ కూడా వారికి నేర్పబడుతున్నయ్. మరుగుదొడ్లు, నానుడుగోతులు, కంపోస్టు గోతులను తయారు చేయడంలోను, దోమలు, ఈగలు నశించేందుకు క్రిమిహారముల ప్రయోగంలోను, విద్యార్థులకు, ప్రత్యక్ష నిదర్శనలతో వ్యక్తి సమిష్టి శిక్షణ యివ్వబడుతోంది. విద్యార్థులకు టీకాలు వేయడంకూడా నేర్పబడింది.

## విద్యారంగంలో విస్తరణ.

విద్యాబోధన ఎంత విస్తృత పరిమాణాలను కలిగిఉన్నదో అంత ముఖ్యస్థానంకూడా కలిగిఉన్నది. విద్యారంగంలో విస్తరణ ఒకవిధంగా గ్రామీణ వయోజనవిద్య అనవచ్చునేమో. ఇక్కడ విస్తరణకు లక్ష్యం సమిష్టికృషిలో పాల్గొనేందుకు ప్రతివ్యక్తికీ ప్రోత్సాహమివ్వడం. ప్రస్తుతం గ్రామపాఠశాలలలో అవలంబింప బడుతున్న విధానాల ప్రయోజనాల నేవిధంగా అధికం చేయ వచ్చునో, విద్యార్థులీ కేంద్రంలో తెలుసుకొంటారు. విద్యా కేంద్రాలు, సామాజిక కేంద్రాలు, పిల్లలకు క్లబ్ లు, ఆటపాటల ఉత్సవాలు ఏ విధంగా నిర్వహించాలోకూడా వీరు తెలుసు కొంటారు. వయోజనుల మనస్తత్వం, సమూహా నేర్పబడుతయ్. సంఘసేవ చేయగలందులకు ప్రతివయోజనుని మనస్సును వికసింప జేయడానికి, కావలసిన సాంఘిక పరిణామాన్నే విధంగా సాధించ వచ్చునో విద్యార్థి ప్రత్యక్షానుభవంవల్ల తెలుసుకొంటాడు. విద్యావిషయక సమాచారసేకరణ, వయోజన విద్యాకేంద్రాల నిర్వహణ, గ్రామంలో చిన్న చిన్న సమావేశాల నిర్వహణ, శబ్దదృశ్యపరికరాల ఉపయోగం, భజనలు, హరికథలు, సాంస్కృ తిక కార్యక్రమాలు మొదలయినవాటిని నిర్వహించి, గ్రామస్థు లలో ఉత్సాహాన్ని పెంపొందింప జేయడానికి, వారి మనసులను వికసింపజేయడానికి, విద్యార్థులకు కావలసిన శిక్షణయివ్వబడు తుంది. పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలు, అంశాలు, కమ్యూనిటి ప్రాజెక్టుల పరిపాలనా వ్యవస్థయొక్క స్వరూపం, కూడా విద్యా ర్థులకు బోధింపబడ్తాయి. సాముదాయక అభివృద్ధి కార్యక్రమం కొనసాగాలంటే, కొద్దిపాటి బాహ్యసహాయంతో అందరూ

స్వయంకృషి సలపాలి. ఇందువల్ల ప్రజల విజ్ఞానం పెంపొందడమే కాక, స్వయంకృషివల్ల వారిశక్తికూడా అతిశయించే అవకాశం ఉన్నది. ఇదే ఈ కార్యక్రమంయొక్క ప్రత్యేకత ఈ విషయం విద్యార్థులందరికీ సుస్పష్టం చేయబడుతుంది. ఈ కేంద్రంలోని అధ్యాపకుల విశ్రాంతిగదిలో ఒక పుస్తకబండారం, ఒక వస్తుప్రదర్శనశాలకూడా ఉన్నయ్. ఒక సమాచార కేంద్రంకూడా నిర్వహింపబడుతోంది,

## సహకార సంస్థలు, గ్రామపంచాయతీలు.

గ్రామాలలో సహకారసంస్థలను నెలకొల్పడం, గ్రామస్థులకు వాటి ప్రయోజనాన్ని అధికంచేయడం, విద్యార్థులుపొందే శిక్షణలో ఒకభాగం. విద్యార్థులందరూ సహకార పద్ధతిని భోజనశాలను నడుపుకొంటున్నారు. గ్రామసేవలో ఒకభాగంగా, గ్రామీణ సహకారసంస్థలే విధంగా పనిచేస్తాయో విద్యార్థులు తెలుసుకొంటారు. సమీపంలోఉన్న గ్రామాలను సందర్శించి, విద్యార్థులు గ్రామ పంచాయతీ లేవిధంగా పనిచేస్తాయో తెలుసుకొంటారు.

## శిక్షణపొందిన విద్యార్థులు.

ఈ కేంద్రం రెండుషిఫ్ట్లలో పని జేస్తోంది. ఇక్కడి శిక్షణ పొందిన మొదటిజట్టులో 94 మంది విద్యార్థులున్నారు. శిక్షణానంతరం, వారు వివిధ కేంద్రాల్లో గ్రామసేవకులుగా నియమింపబడ్డారు. బేసిక్ వ్యవసాయ శిక్షణపొందిన 28 మంది విద్యార్థులు విస్తరణ శిక్షణపొందడాని. కర్హులయినారు. ప్రస్తుతం శిక్షణ పొందుతున్నవారిలో 109 మంది విస్తరణ విద్యార్థులు 45 మంది

బేసిక్ వ్యవసాయ విద్యార్థులు వీరికి శిక్షణ 1956 ఫిబ్రవరి ఆఖరువారంలో ప్రారంభమయింది.

## అధ్యాపకుల అనుభవం.

ఈ కేంద్రం స్థాపించి ఎన్నాళ్ళో కాలేదు. అందుచేత, అభివృద్ధికింకా ఆస్కారముంది. ఇక్కడి అధ్యాపకవర్గంలో కొందరు సామర్లకోటకు వెళ్ళి అక్కడ విధానాలను పరిశీలించివచ్చారు. ఇది వారిపనికెంతో సాయపడింది. ఇక్కడ సాంఘికవిద్యకు ఉన్న అధ్యాపకుడు, మైసూరులో ఇప్పుడప్పుడే చదువునేర్చుకొంటున్న వయోజనుల నిమిత్తం సాహిత్యం తయారుచేయడానికి, భారత ప్రభుత్వంచే నెలకొల్పబడిన 'లిటరసీ వర్క్ షాప్'లో అనుభవం గడించారు. తదనంతరం, 1955 లో అలహాబాద్‌లోని వ్యవసాయ సంస్థలో, విస్తరణ శిక్షణపొందారు. మిగిలినవారు, కేంద్రంలోనే, వారి ఉద్యోగ నిర్వహణలో కావలసినంత అనుభవం గడిస్తున్నారు. ఇక్కడ అందరిలోను, నవభారత నిర్మాణంలో భాగస్వాములు కాగలిగినందుకు, ఆనందం వెల్లివిరుస్తోంది. కారు చీకటిలోకి కాంతి కిరణాలను ప్రసరింపజేసే కాంతి పుంజాలాంటి యీ కర్మక్షేత్రంలో పనిజేయగల అవకాశం లభించినందుకు వారు తాము ధన్యులైనటు భావిస్తున్నారు.

## 4. ఉద్యోగకాలంలో శిక్షణ.

మన రాష్ట్రంలో నిర్వహణ నిమిత్తం మన ప్రభుత్వం ఒక విస్తృత శిక్షణ కార్యక్రమాన్ని తయారుచేసింది. దీనిని కొనసాగించేందుకు, దాని పురోగమనాన్ని, నిరంతరం గమనించేందుకు ఒక డైరెక్టరును నియమించింది. ఆయన అధ్వర్యంలో అమలవుతున్న శిక్షణ కార్యక్రమంలో, ఇంతవరకు వర్ణింపబడిన విస్తరణ శిక్షణ భాగంమాత్రమే. శిక్షణలో అది ముఖ్యభాగమే కావచ్చుగాని, అది భాగంమాత్రమే.

గత నాలుగేళ్ళ అనుభవం, ఈ శిక్షణను గురించి ఎన్నో విషయాలను మనకు తెలియజేసింది. విద్యార్థులు ఈ శిక్షణ కేంద్రాలలోపొందే శిక్షణను రంగంలో కొనసాగించి వృద్ధి చేయవలసిన అవసరం, ఈ అనుభవంవల్ల తెలిసివచ్చింది. విద్యార్థి రంగంలో ప్రవేశించిన తరువాత, క్రొత్త పరిస్థితులలో క్రొత్త సమస్యల నెదుర్కొనవలసివస్తుంది. కార్యక్రమంలో ఇవ్వాళ ప్రాధాన్యతపొందిన విషయాలు రేపు దానిని కోల్పోతాయి. కార్యక్రమంయొక్క స్వరూపమే ఒక్కొక్కసారి మారుతుంటుంది. ఈ మహోజ్వల ఉద్యమంలో గ్రామసేవకుడు తన పాత్రను సమర్థతతో నిర్వహించాలంటే, అతనికి మఱొకసారి ప్రత్యక్ష శిక్షణ యివ్వడం ఎంతో అవసరం. అప్పుడుగాని, అతడు కాలంతోపాటు పురోగమించలేడు.

ఈ విధమైన శిక్షణకు 'ఇన్‌సర్వీస్ ట్రెయినింగ్' (ఉద్యోగ కాలంలో శిక్షణ) అనిపేరు.

ఈ శిక్షణ నాలుగువిధాలుగా ఉంటుంది.

(1) రిఫ్రెషర్ కోర్సు
(2) గోష్టులు, సమావేశాలు.
(3) పరిశీలనా పర్యటనలు.
(4) ప్రదర్శనలు.

## రిఫ్రెషర్ కోర్సులు.

వ్యవసాయంలోగాని, ఆరోగ్యంలోగాని, ఇంకే యితర రంగంలోని, ఆధునాతన శాస్త్రీయపరిణామాలను, గ్రామసేవకులకు తెలియజేస్తూండాలంటే ఈ రిఫ్రెషర్ కోర్సులకన్నా ఉత్తమ మార్గంలేదు. అతని ఉద్యోగంలో అతను నిరంతరమూ ఎదుర్కొనవలసిన నూతన సమస్యలను పరిష్కరించేందుకు కూడా ఇవి అతనికి సాయపడ్తవి. వివిధ అభివృద్ధి కేంద్రాలలోను, శిక్షణకేంద్రాల్లోను పనిచేస్తున్న అధ్యాపకులకు, కార్యకర్తలకు, ఈ రిఫ్రెషర్ శిక్షణనిచ్చేందుకు ఒక తాత్కాలిక పథకం తయారుచేయబడింది. ఉద్యోగకాలంలోనే యివ్వబడేశిక్షణ కార్యక్రమాలకు నియమింపబడిన దర్శకుడు, ఒక కేంద్రస్థానంలో, ఈ తరగతిని నిర్వహిస్తాగా, కావలసిన వసతులన్నీ అక్కడ లభ్యంకావడం వల్ల, ఈ శిక్షణ, బాపట్లలోని, బేసిక్ వ్యవసాయ పాఠశాలలోను, కాళహస్తి, సామర్లకోటలోని విస్తరణ శిక్షణ కేంద్రాలలోను నిర్వహింపబడటంకద్దు. శ్రీకాకులం, విశాఖపట్నం, తూర్పుగోదావరిజిల్లాల్లోని సాముదాయక అభివృద్ధి కార్యక్రమ కార్యకర్తలు సామర్లకోటలోని విస్తరణ శిక్షణకేంద్రానికి పంపబడ్తారు. పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాల్లో పని

చేస్తున్న సిబ్బంది ఈ శిక్షణనిమిత్తం బాపట్లలోని, బేసిక్ వ్యవసాయ పాఠశాలకు వెళ్తారు.

నెల్లూరు, చిత్తూరు, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాల్లోని సిబ్బందికి, కాళహస్తిలోని విస్తరణ శిక్షణ కేంద్రంలో, యీ శిక్షణ లభిస్తుంది. ప్రారంభంలో, 1952 నుండి 55 వరకు నెలకొల్పబడిన సాముదాయక అభివృద్ధి కేంద్రాల్లోని శిబ్బందిని జాతీయవిస్తరణ కేంద్రాలలోని శిబ్బందిని శిక్షణనిమిత్తం ఎన్నుకొంటారు. ఎవరికైతే, ఆధునాతన శాస్త్రీయ పరిణామాలను తెలియజేయవలసిన అవసరమున్నదో వారికి ఈశిక్షణనుముందుగా యిస్తారు. ప్రతి రెండు సంవత్సరాల కొకసారి సిబ్బంది యీ శిక్షణను పొందుతుంది; 1955–56 లోను, 56–57 లోను నెలకొల్పబడిన కేంద్రాలలోని సిబ్బందికి యీ శిక్షణ కొంతకాలం గడిచిన పిదపలభిస్తుంది.

హిమయత్ సాగర్‌లోని అభివృద్ధి ఉద్యోగుల శిక్షణా కేంద్రంలో విద్యార్థులసంఖ్య స్వల్పంగాఉండే రోజుల్లో మన రాష్ట్రంలోని బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్లకు, ప్రతి రెండు సంవత్సరాల కొకసారి, రెండు వారాలపాటు రిఫ్రెషర్ శిక్షణ యివ్వడానికి వీలున్నదో, లేదో తెలుపవలసిందిగా కేంద్రప్రభుత్వాన్ని అడగడమయింది. ఈ శిక్షణకు అక్కడ అవకాశం లభించని పక్షంలో, మనరాష్ట్రంలోనే సామర్లకోటలోని విస్తరణ శిక్షణ కేంద్రంలో ఆటువంటి శిక్షణకు సన్నాహాలు జరుగుతయి.

విస్తరణోద్యోగుల నిమిత్తం సామర్లకోటలోని విస్తరణ కేంద్రంలో 'గ్రూప్ లెవెల్' కార్యకర్తల శిక్షణ తరగతులు

జరుగుతున్నాయి. ఇవి రెండు సంవత్సరాలనుండి కొనసాగుతు న్నాయి. దీని నిర్వహణాబాధ్యతఅంతా ఆ కేంద్రంలోనేఉన్న "అగ్రోనామిస్ట్, వహిస్తున్నారు. ఈశిక్షణ తరగతికాల పరిమితి రెండునెలలు. ప్రతిసారి యిందులో 15 మందికన్నా ఎక్కువ చేర డానికి వీలులేదు. ఈ తరగతులు సంవత్సరానికి నాలుగుసార్లు జరుగుతాయి, ఈ పథకం 15-10-55 న ప్రారంభమయింది. ఇంతవరకు మూడుజట్లకు శిక్షణ యివ్వబడింది. మొదటి జట్టులో 13 మందికి, రెండవజట్టులో 14 మందికి మూడవజట్టులో 14 మందికి యీ శిక్షణ యివ్వబడింది. 15 మంది విద్యార్థులుగల నాల్గవజట్టుకు శిక్షణ 15-7-56 నుండి ప్రారంభమవుతుంది. ఈ పథకంవల్ల సహకార రంగంలోని విస్తరణోద్యోగులకు లాభం కలిగినా, సాంఘికవిద్యా వ్యవసాయకులకుమాత్రం ఇది యేవిధం గానూ ఉపయోగపడదు. బ్లాకు స్థాయిలో సహకారరంగంలోని విస్తరణోద్యోగులకు రిజర్వ్‌బ్యాంక్ వారు తిరుపతిలో ఒక 3½ నెలల శిక్షణ తరగతిని నెలకొల్పారు. మొదటిజట్టు 25-1-56 నుండి 9-5-1956 వరకు శిక్షణపొందింది. యీ జట్టులో 15 మంది విద్యార్థులున్నారు. 13 మంది సభ్యులుగల రెండవజట్టుకు 25-5-56 నుండి శిక్షణ ప్రారంభమై కొనసాగుతోంది.

వ్యవసాయంలోను, పశుపోషణలోను విస్తరణోద్యోగు లకు శిక్షణ బాపట్లలోని బేసిక్ వ్యవసాయ కళాశాలలో లభి స్తుంది. అక్కడవున్న వ్యవసాయకళాశాలలోను, పశుశాస్త్ర కళాశాలలోను లభ్యమయే వసతులు, నిపుణుల సహాయం ఇందుకు కారణం.

బ్లాకుస్థాయిలో, సహకార రంగంలోని విస్తరణోద్యోగు లను ప్రతి రెండుసంవత్సరాల కొకసారి, మూడువారాలపాటు.

యీ రిఫ్రెషర్ శిక్షణపొందే నిమిత్తం తిరుపతిలోని ప్రాంతీయ శిక్షణ కేంద్రానికి పంపవలసి వుంటుంది. ఇదేవిధంగా సాంఘిక విద్యా వ్యవస్థాపకులను ప్రతి రెండుసంవత్సరాల కొకసారి, హిమయత్ సాగర్‌లోని సాంఘిక విద్యా వ్యవస్థాపకుల శిక్షణ కేంద్రానికిగాని, గాంధీగ్రామ్‌లోని కేంద్రానికిగాని, రెండుమూడువారాల పాటు పంపించవలసి వుంటుంది. గ్రామస్థాయి కార్యకర్తలను, రాష్ట్రంలోని మూడు శిక్షణ కేంద్రాలకు పంపవలసుంటుంది.

## శిక్షణకాలం, విద్యార్థులసంఖ్య.

బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్లకు పదిమంది కొకసారి 2 వారాలపాటు, ప్రతిసంవత్సరమూ యీ శిక్షణ నిస్తారు. సాంఘిక విద్యావ్యవస్థాపకులు, విస్తరణోద్యోగులకు యిరవైయ్యేసిమందికి వొకసారి రెండుసంవత్సరాల కొకసారి మూడు వారాలపాటు శిక్షణ యివ్వబడుతుంది. గ్రామసేవకులు 40 మంది ఒక జట్టుగా ప్రతి రెండుసంవత్సరాల కొకసారి ఈశిక్షణను నెలరోజులపాటు పొందుతారు.

## అధ్యాపకవర్గం, ఇతర వసతులు.

ప్రస్తుతం శిక్షణ కేంద్రాలలో లభ్యమవుతున్న వసతులు, అక్కడ వున్నటువంటి గ్రామసేవకులకు సరిపడి, సరిపడకుండా ఉన్నయ్. రిఫ్రెషర్ కోర్సులను నడిపేందుకు ఒక ఉపన్యాస మండిరం, ఒక వంటయిల్లు, వసతిగృహం మొదలయిన అదనపు వసతులను ప్రతి కేంద్రంలోనూ కల్పించడం ఎంత్తైనా అవుసరం. ఈ వసతులను కల్పించడానికి, ఇంకా అవసరమయే సాధనసామగ్రిని సమకూర్చడానికి ప్రతికేంద్రానికి 50 వేల రూపాయలదాకా

ఖర్చుచేయవలసి వుంటుందని అంచనా వేయబడింది. ప్రస్తుతానికి, వ్యవసాయాని కిద్దరధ్యాపకులను, పశుసంవర్ధన కొక అధ్యాపకుణ్ణి అదనంగా నియమించి పని గడుపుకోవచ్చును. వీరు శిక్షణపొంద వలసిన వారిలోకల్లా అధిక సంఖ్యాకులయిన గ్రామసేవకుల శిక్షణను నిర్వహిస్తారు.

ఇందువలన, ప్రతికేంద్రానికి అదనంగా 5,000 ల రూపాయలదాకా ఖర్చు కావచ్చును.

## ఒక తాత్కాలిక చర్య.

కమ్యూనిటీ ప్రాజెక్టుల పరిపాలనావస్థకు వ్యవసాయ విషయాల్లో సలహాదారుడైన, శ్రీ జె. ఎస్. పటేల్, ఒకటి, రెండు జిల్లాల్లో రిఫ్రెషర్ నిర్ణీతకేంద్రాల్లో శిక్షణ నమలుచేయడానికి ఒకమార్గం సూచించారు. మన రాష్ట్రంలో ప్రతికేంద్రంలోను, ఈ శిక్షణను పరిష్టమయిన పద్ధతులపై కొనసాగించడానికి అనువైన వసతులు సమకూరేదాకా, తాత్కాలిక చర్యగా శ్రీ జె. ఎస్. పటేల్‌గారి సూచన నమలుచేయాలని సంకల్పింపబడింది. రంగంలో పనిచేస్తున్న కార్యకర్తల్లో సగంమందికి పైగా గ్రామసేవకులే ఉన్నారు. వీరిని శిక్షణకేంద్రాలకు తీసుకువెళ్లే బదులు శిక్షణకేంద్రాలనే వీరివద్దకు తీసుకువస్తే శిక్షణ తక్కువకాలంలో ఎక్కువమందికి యిచ్చే వీలు కలుగుతుంది. ఇందుకు కొంతమంది నిపుణులతో ఒక సంచారక శిక్షణకేంద్ర నెలకొల్పి, దానిని ప్రతిబ్లాకుకు తీసుకు వెళ్ళడం జరుగుతుంది. ప్రతి రెండుసంవత్సరాలకొకసారి, యీ సంచారకకేంద్రాన్ని మూడువారాలపాటు ఒక బ్లాకులో అనువైనచోట ఉంచితే గ్రామసేవకుల రిఫ్రెషర్ శిక్షణ అతి త్వరితంగా పూర్తవుతుంది.

## గోష్టులు.

కాలం గడిచినకొద్దీ, అధికారులకు, అనధికారులకు అనుభవం ఎక్కువైనకొద్దీ, ఈ ఉద్యమంయొక్క సమస్యలను గురించిన విజ్ఞానంకూడా అధికమవుతోంది. వీరందరూ ఒకచోటచేరి, తమ అనుభవాలను పరస్పరం చర్చించుకోవడం సర్వత్రా లాభదాయకం. ఈ చర్చలు కొనసాగాలంటే ఉద్యోగుల గోష్టులను మించిన ఉత్తమమార్గం ఉండబోదు. బ్లాకుస్థాయిలోను జిల్లా స్థాయిలోను ఇటువంటి గోష్టులు జరిగాయి. రాష్ట్రస్థాయిలో ఈ గోష్టులు రెండు జరిగాయి. వీటిలో చివదిరి ఫిబ్రవరి 56 లో జరిగింది. ఈ గోష్టిలో వివిధ ప్రభుత్వశాఖల కార్యదర్శులు, ఉన్నతాధికారులు, జిల్లాకలెక్టర్లు పాల్గొన్నారు. ఇంతవరకూ సాధింపబడినఫలితాలనూ, జరిగినకృషిని సమీక్షిస్తూ; భావిలో అనుసరణీయ మార్గాలను చూచిస్తూ, ఈ సందర్భంలో, ఆంధ్ర గవర్నరు, ముఖ్యమంత్రి ప్రణాళికలమంత్రి, డెవలప్‌మెంట్ కమీషనర్లు ప్రసంగించారు. ఈ గోష్టులలో సమానత్వం ఉట్టిపడుతుంది. అనేక సాయిాలకు చెందిన ఉద్యోగులు, అనధికారులు ఏ విచక్షణా లేకుండా కలిసి మెలసి వ్యవహరిస్తారు. సాంఘిక సమానత్వం, ఒక గొప్ప ఉద్యమంలో, ప్రజల, ప్రభుత్వ సహాపయనం, ఈ గోష్టులలో మనకు ఆచరణలో కన్పిస్తాయి. కమ్యూనిటి ప్రాజెక్టుల 'ఎడ్మినిస్ట్రేటర్' శ్రీ ఎస్. కె. డె. ఫిబ్రవరిలో జరిగిన రాష్ట్రీయ ప్రణాళికోద్యోగుల గోష్టిని ప్రత్యేకాహ్వానంపై సందర్శించారు. ఇంతవరకు సాధింపబడిన పురోగమనాన్ని సమీక్షిస్తూ, ఆంధ్రుల కార్య శూరత్వాన్ని ప్రశంశించారు.

కన్యాకుమారిలోను, హైదరాబాద్‌లోను జరిగిన అంత ర్రాష్ట్రీయ ప్రణాళికోద్యోగుల గోష్టిలో, సచివాలయ, ఉన్నతోద్యోగులు జిల్లా ప్రణాళికల ఉద్యోగులు, బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్లు, విస్తరణ కేంద్రాల ప్రధానాధ్యాపకులు బేసిక్ వ్యవసాయ పాఠశాల సూపరెండెంట్లు కొంతమంది, అనధికారులు, ఆంధ్రరాష్ట్ర ప్రతినిధులుగా పాల్గొన్నారు. ఈ సమావేశాల్లో అనేక రాష్ట్రాలనుండి ప్రతినిధులు పాల్గొనడంచేత, ఉద్యమం యొక్క అఖిల భారత స్వభావం అందరికీ కన్నులకు కట్టినట్లయింది. ఈ సమావేశాల్లో ప్రతినిధులకు లభించిన అనుభవాలు, ఉత్సాహకరంగానే కాక, విజ్ఞాన ప్రబోధకంగాకూడా పరిణమించాయి.

## ౫. గ్రామనాయకులకు శిక్షణ.

ప్రజల సహకారంతో ప్రభుత్వోద్యమంగా ప్రారంభ మయిన యీ ఉద్యమం, క్రమంగా ప్రభుత్వ సహాయంతో ప్రజల ఉద్యమంగా రూపొందడానికి, ప్రభుత్వ సహాయం క్రమంగా తగ్గుతూ ఇందులో ప్రజలపాత్ర నానాటికి అధికమవడానికి, గ్రామాల్లో సంఘీభావాన్ని వీలైనంత అధికంగా వినియోగించా అని సాముదాయక అభివృద్ధి కార్యక్రమం లక్షిస్తోంది.

ఇప్పటివరకు, గ్రామస్థుల నందరినీ కూడగట్టుకొని, వారికి నాయకత్వం వహించి వారిచేత నిర్మాణాత్మక కృషి చేయించ డానికీ కార్యక్రమం; గ్రామాల్లో కార్యకర్తఅయిన గ్రామసేవ కునిపై ఆధారపడుతుండేది. కాని గ్రామసేవకుడు ఒకటికాదు, రెండుకాదు పదిగ్రామాల్లో అనేక వ్యవహారాలను చక్కబెట్టాలి: కాబట్టి గ్రామాల్లో నాయకత్వం ఏమాత్రం ప్రయోజనకరంగా ఉండాలన్నా అది మరింత బహుళంగా ఉండాలనీ, గ్రామాలకు నాయకత్వం అనధికారులే వహించాలనీ అనిపించింది. గ్రామ స్థులనుండే వారినాయకుల నెన్నుకొని, వారి కవసరమయిన శిక్షణ నిస్తే, ఈ ఉద్యమంలో ప్రజల సహకారం అధికమవుతుంది. ఎట్టు వంటి అవరోధాన్నయినా అవలీలగా అతిక్రమించి, ఇనుమడించిన వేగంతో యీ ఉద్యమం పురోగమిస్తుంది. ఇది నిర్వివాదం. గ్రామాల్లో ఎంతో అవసరమయిన ఈ నాయకత్వాన్ని సృష్టిం చేందుకుజరగబోయే ప్రయత్నానికి గ్రామనాయకుల శిక్షణ శిబి రాల నిర్వహణ నాందిమాత్రమే.

## శిబిరాలు.

గ్రామనాయకుల శిక్షణ శిబిరాలను నిర్వహించే నిమిత్తం ప్రభుత్వం మార్చి 56 లో ఒక దర్శకుని నియమించింది. జూన్ 56 వరకు, 56 శిక్షణ శిబిరాల్లో 2400 ల మందికి శిక్షణ యివ్వబడింది. ఈ శిక్షణ పొందినవారిలో 300 ల మందిదాకా స్త్రీలే ఉన్నారు. వివరాలకు క్రిందిపట్టీ నొకసారి చూడండి.

| జిల్లా | శిబిరాలసంఖ్య | పురుషులు | స్త్రీలు |
|---|---|---|---|
| కృష్ణా | 6 | 259 | 50 |
| అనంతపురం | 10 | 408 | 41 |
| నెల్లూరు | 6 | 136 | 47 |
| చిత్తూరు | 9 | 251 | — |
| కర్నూలు | 9 | 339 | 48 |
| కడప | 4 | 219 | 11 |
| గుంటూరు | 4 | 96 | 33 |
| విశాఖపట్నం | 6 | 312 | 65 |
| శ్రీకాకుళం | 4 | 128 | — |
| మొత్తం | 58 | 2148 | 259 |

ఈ శిబిరాల్లో స్త్రీలకు విడిగా ఒకభాగం నడుపబడుతుంది. ఇంతవరకు స్త్రీలకు ప్రత్యేక శిక్షణ శిబిరాలు 2 నిర్వహింపబడ్డాయి. ఈ విధంగా శిణపొందిన స్త్రీలందరూ గ్రామీణసంక్షేమ కార్యకలాపాలను నిర్వహిస్తారు. స్త్రీ విద్యావ్యాప్తిలోను, స్త్రీలకు, గృహనిర్వహణ, శిశుసంక్షేమం, కుటుంబసంనియమం, కుట్టుపని, మొదలయిన విషయాలను బోధించడంలోను వీరు

ప్రముఖపాత్ర వహిస్తారు. సాంస్కృతిక కార్యక్రమాల్లోను, రేడియో కార్యక్రమాల్లోను గ్రామాల్లో స్త్రీలకు ఉత్సాహం కలిగిస్తారు.

## గ్రామనాయకుల ఎన్నిక.

శిక్షణకు అభ్యర్థులను బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫ్ సరే ఎన్నుకొంటాడు. శిక్షణకు అభ్యర్థిఎన్నిక అతనికున్న అభ్యుదయ కాంక్ష, అతని పురోగమనాత్మక దృక్పథం, శ్రమపట్ల అతనికున్న ఉత్సాహంమీద ఆధారపడి ఉంటుంది. పెద్దవారికి పను లనేకం ఉంటవి. శిబిరాల్లోని క్రమబద్ధమైన జీవితంలోకి వారు త్వరగా ఇముడలేరు. వారి పనులను విడిచిపెట్టివచ్చి, యీ శిక్షణ పొందేం దుకు వారు విముఖులుగా ఉంటారు. అందుచేత, శిక్షణ పొందే వారిలో చాలామంది యువకులు, అందులోను యువకర్షకులే ఉంటారు.

ఈ విధంగా శిక్షణపొందిన యువకులు, తమ తమ పెద్దల సంపూర్ణ సహాయ సహకారాలతో అభ్యుదయ కార్యక్రమాలను జయప్రదంగా కొనసాగిస్తారని అనుకోవచ్చును. శిక్షణకాలంలో వీరికందరికీ ఈ విషయం స్పష్టంచేయబడుతుంది.

శిక్షణకాలంలోగాని, తదనంతరంగాని విద్యార్థులకు ఎట్టు వంటి ధనసహాయమూ ముట్టదు. ప్రభుత్వంవారికి శిక్షణ కాలంలో భోజనవసతులనుమాత్రం ఉచితంగా కల్పిస్తుంది. ప్రతిబ్లాకుకు, శిక్షణ శిబిరాలను నిర్వహించేనిమిత్తం సాలుకు 1,500 ల రూపాయలసహాయం ప్రభుత్వంవద్దనుండి లభిస్తుంది. శిక్షణ శిబిరంయొక్క గరిష్టపరిణామం 40 మంది అభ్యర్థులు.

శిక్షణశిబిరాలు ప్రతిబ్లాకులోను రెండు నెలలకొకసారి నిర్వహింపబడ్డవి. బ్లాకుకు ఐదారు మైళ్ళదూరంలోవలవున్న, ప్రతిగ్రామం నుండీ ముగ్గురో, నలుగురో ప్రతినిధులెన్నుకోబడ్డారు. శిక్షణ పొందేవారిలో, సాముదాయక అభివృద్ధి కార్యక్రమ జయప్రద నిర్వహణకు తప్పనిసరిగా కావలసిన సహకార సంస్థలసభ్యులు, పంచాయతీసభ్యులు, ఇతర స్థానికసంస్థల సభ్యులుకూడా చేర్చుకోబడ్డారు.

## శిక్షణ.

శిబిరాలలో ప్రజాస్వామ్యం ప్రతిబింబిస్తూంటూంది. అధికారులకు, శిక్షణపొందుతున్నవారికీ మధ్య ఎటువంటి అడ్డంకులూ, పట్టింపులూఉండవు. శిక్షణలో, వ్యవసాయం, పశుపోషణ ఆరోగ్యం, పారిశుద్ధ్యం మొదలయిన విషయాలలో నవీన విధానాల భోధనకెక్కువ ప్రాధాన్యమివ్వబడుతుంది. ఉపన్యాసాలు, ప్రదర్శనలు ఇవ్వబడుతవి. శిక్షణపొందేవారు అనేక విషయాలనుచేసి తెలుసుకోవలసివుంటుంది. ఇక్కడ శిక్షణపొందేవారు ప్రతిరోజు కొంతకాలం చెమటోడ్చి ఏదైనా పని చేయాలి. ప్రతిసాయంత్రం, వీరు నాటకాలు, జానపదనృత్యాలు ఇతర సాంస్కృతిక కార్యక్రమాలు ప్రదర్శిస్తారు. వయోజన విద్యాకేంద్రాల నిర్వహణ, స్త్రీ, యువజన సమాజాల సంస్థాపన, సమిష్టిప్రయోజనాలకోసం ప్రతివ్యక్తినికూడ గట్టుకొని పనిజేయడం మొదలయిన సాంఘిక విషయాలెన్నిటినో ఇక్కడ నేర్చుకొనవచ్చును. ఈ బహుముఖమైన యీ శిక్షణను విద్యార్థులు స్వీకరించినవైనం, ఎంతో ఆశాజనకంగా ఉన్నది. ఈ నిర్మాణాత్మకకృషిలో వారికున్న నూతనపాత్రను వారు గ్రహి

స్తున్నారు, ఎరువుల ప్రయోగంవల్ల లాభాలు, మేటి విత్తనాల ప్రయోజనాలు సంరక్షణవిధానాలవల్ల ఉపయోగాలు తెలుసుకొని తృప్తిపడ్డారు. గృహపారిశుద్ధ్యంయొక్క అవసరం, గ్రామ పారిశుద్ధ్యంలోను ఇతర కార్యకలాపాలలోను సమిష్టికృషి సాధింపగల ఫలితాలను తెలుసుకొని వీరు ఉత్తేజితులయినారు. శిక్షణ ముగిసినతర్వాత, తమ తమ గ్రామాలకు తిరిగివెళ్తూ, తాము ఇక్కడ నేర్చుకొన్న విషయాలను తప్పకుండా ఆచరణలోకి తెస్తామని ఎంతో ఉత్సాహంతో వాగ్దానంచేశారు. ఈ శిబిరాల్లో జరుగుతున్న కృషివి నూత్నమైనది. నిరంతర అప్రమత్తతో దీని వివిధపరిణామాలను, పురోగమనాన్ని గమనించటం ఎంతైనా అవసరం. డెవలప్‌మెంట్ కమీషనర్, ఈ శిబిరాలను పెక్కింటిని సందర్శించారు. అక్కడవారి అనుభవాలాధారంగా ఈ శిబిరాలలో అవలంబింపబడవలసిన శిక్షణక్రమంగూర్చి విపులంగా సూచనలుచేశారు. వారుచేసిన సూచనలప్రకారం తయారయిన శిక్షణపథకం అనుబంధంలో యివ్వబడింది. ఈ శిబిరాలలో సాధింపబడిన ఫలితాలను నెలకొకసారి, ఆయా జల్లా కలెక్టర్లు ప్రభుత్వానికి తెలియజేస్తూండాలనికూడా వీరు సూచించారు. ఈ శిక్షణశిబిరాలలో వివిధశాఖలజిల్లా అధికారులు పాల్గొనాలని, అందుకు తగినయేర్పాట్లుజిల్లాకలెక్టర్లు చేయాలనికూడా సూచింపబడింది. అగ్నిమాపక చర్యలనుకూడా ఈ శిబిరాల్లో బోధించాలనే సూచనకూడా చేయబడింది.

## శిక్షణపొందిన తరువాత.

శిక్షణ పొందినతరువాత గ్రామనాయకుల కార్యకలాపాలను గ్రామసేవకుడు గమనిస్తూవాటిని ఎప్పటికప్పుడు ఒక

పుస్తకంలో వ్రాసుకొంటాడు. దీనిని పై అధికారులు పరిశీలించి, ఈ శిబిరాల్లో గ్రామనాయకులుపొందిన అనుభవాలను ఎంత ప్రయోజనకరంగా వినియోగించుకొంటున్నారో తెలుసుకొంటారు. గ్రామీణ కార్యక్రమాల్లో గ్రామనాయకులు తమ పాత్రను ఉత్సాహంతో నిర్వహించాలంటే వారికి, ప్రభుత్వ సిబ్బందికి కొంత సంబంధముండటం ఎంతైనా అవసరం, కంపోస్టు గోతులు త్రవ్వడం, మేలివిత్తనాలు, రసాయనికపు ఎరువుల వినియోగాన్ని, అధికంచేయడం, వయోజన విద్యాసంస్థలు నెల కొల్పి నిర్వహించడం గ్రామనాయకుడు సాధారణంగా చేసే పనులలో కొన్ని. ప్రస్తుతం ప్రతిగ్రామంలోను కక్షలు పెరిగి పోయినవి. అనేకరంగాల్లో అభివృద్ధి కార్యక్రమాలకీ కక్షలు అవరోధాలుగా పరిణమిస్తున్నయ్. గ్రామాభివృద్ధి లక్ష్యంగా చూపించి, అందుకు సమిష్టికృషి చేయడానికి గ్రామస్థులను ఒప్పింపగలిగితే, ఈ కక్షలు, స్పర్ధలు, హటంతటవే సమసిపోవడం మనం చూడగలుగుతున్నాం. ఈ విషయంలో మనం సాధింప గలిగిన ఫలితాలు ఉత్సాహకరంగాను, ఆశాజనకంగాను ఉన్నయ్. ఈ శిక్షణశిబిరాల్లో తయారయిన నాయకులు, తమ గ్రామాల లోని అనేకసమస్యలను అవగాహన చేసుకొని, వాటి పరిష్కారానికి నిర్విరామంగా కృషిచేస్తున్నారు. వారి శ్రమవల్ల గ్రామం ఎంతోలాభం పొందుతోంది.

## అనుబంధము

### విషయం :— గ్రామనాయకుల శిక్షణ - శిక్షణ కార్యక్రమం

శిక్షణ శిబిరాల నిర్వహణలోను, వాటి ముఖ్య కార్య కలాపాలలోను సామరస్యం సాధించే నిమిత్తం ఈ దిగువ కార్యక్రమం అనుసరణీయంగా నిర్ణయించబడింది. శిక్షణశిబిరం మూడు రోజులపాటు నిర్వహింపబడుతుంది.

(1) ఇటీవలనే ఈ శిక్షణ శిబిరాల కాలపరిమితికి మరొక దినం చేర్చబడింది. ప్రస్తుతం వీటి కాలపరిమితి నాలుగు రోజులు)

●

### మొదటిదినం.

| | |
|---|---|
| ఉదయం 8-00 నుండి 9-30 వరకు | (1) శిబిర ప్రారంభం (2) శిబిరం యొక్క లక్ష్యం, నాయకత్వానికి శిక్షణ పొందవలసిన అవసరం, స్వయం కృషి యొక్క విలువ బయటనుండి కొద్దిపాటి సహాయంతోనే, స్వయంకృషి చేయవలసిన అవసరం, గ్రామీణజీవితాన్నభివృద్ధి చేయవలసిన అవసరం, సాముదాయక అభివృద్ధి కార్యక్రమం మొదలయినవి, స్థూలంగా వివరింపబడ్డాయి. |

## శ్రమదానం

| | |
|---|---|
| ,, 10-00 నుండి 12-00 వరకు | గ్రామంలో పారిశుద్ధ్యం, రోడ్లు వేయడం, లేకపోతే బాగుచేయడం ఏదైనా ఒక ప్రదేశాన్ని సమతలం చేసి, ఆటస్థలం తయారుచేయడం పిల్లలకోసం ఉద్యానవనాలు వేయడం మొదలయిన స్థానికపనులను చేయవలసి వుంటుంది. |
| మధ్యాహ్నం 12 గంటల నుండి 2 గంటల వరకు | భోజనం, విశ్రాంతి. |
| ,, 2 గంటనుండి సాయంత్రం 4 గంటలవరకు | ప్రథమ చికిత్సలో ఉపన్యాసాలు, ప్రదర్శనలు. నవీన వ్యవసాయ పరికరాల, ఉపయోగం ప్రదర్శనలు. |
| ,, 4 గంటలనుండి 4-30 వరకు | ఫలహారం. |
| ,, 4-30 గం॥ నుండి 5-30 వరకు | పొగరాని పొయ్యి కట్టడం నానుడు గొయ్యి త్రవ్వడం మరుగుదొడ్లు కట్టడం, కంపోస్టు గోతులు, ఎరువు-గోతులు త్రవ్వడం, పెట్రొమాక్స్ దీపం వాడడం మొదలయిన విషయాల్లో ప్రత్యేకశిక్షణ. |
| ,, 5-30 గంటలనుండి 6-30 వరకు | ఆటలు |

| | |
|---|---|
| రాత్రి 7-30గంటలనుండి 8-15 వరకు | భోజనం. |
| ,, 8-15 నుండి 9-35 వరకు | సాంస్కృతిక కార్యక్రమం. |

## రెండవరోజు

| | |
|---|---|
| ఉదయం 7 గంటల 30 నిమిషాలకు | ఫలహారం. |
| ,, 7 గంటల 30 నిమిషములనుండి 9 గంటల వరకు | శ్రమదానం. |
| ,, 10.00 గంటలనుండి మధ్యాహ్నం 12.00, | వ్యవసాయం, పశుసంవర్ధన, సహకారం, పంచాయతీలు పారిశుద్ధ్యం మొదలయిన విషయాలపై చర్చలు, ఉపన్యాసాలు. |
| , 12.00 గంటల నుండి 2.00 ,, వరకు | భోజనం, విశ్రాంతి, |
| ,, 2.00 ,, | ప్రథమచికిత్స ఉపన్యాసాలు |
| ,, 3.00 ,, | అగ్నిమాపక చర్యలు |
| | మొదటిరోజునవలెనే ప్రదర్శనలు |
| | ఇక మిగిలిన కార్యక్రమం మొదటి రోజునకార్యక్రమంలాగేఉంటుంది. |

## మూడవరోజు

కొద్ది తేడాలో రెండవరోజు కార్యక్రమమే, ఆ తేడా,

| | |
|---|---|
| సాయంత్రం 5 గంటల 30 నిముషములనుండి 7.00 గంటల వరకు | శిబిరంలోని సభ్యులందరకూ తమ తమ కుటుంబాలకు అభివృద్ధి పథకాలను రచించుకొనేవిధం, నేర్పబడుతుంది. వాటి ఆచరణకు కొన్ని ప్రయోజనకరమైన సూచనలు కూడా ఇవ్వబడుతవి. |

## నాల్గవరోజు

| | |
|---|---|
| ఉదయం 7.30 నుండి ,, 9.30 వరకు | శ్రమదానం. |
| ,, 10.00 నుండి ,, 11.00 వరకు | అగ్నిమాపక దళాలను నెలకొల్పేవిధానంపై ఉపన్యాసం అగ్నిమాపకంలో ప్రత్యక్షశిక్షణ |
| సాయంత్రం 2 గంటలనుండి 4.00 వరకు | సభ్యులు తమ తమ గ్రామాల్లో కొనసాగించవలసిన. కార్యకలాపాలపై ఉపన్యాసాలు. |

ప్రతి శిబిరంలోను ఒక గ్రామీణ వస్తుప్రదర్శన జరగాలి. ఇందులోని వివిధ అంశాలనుగురించి సభ్యులకు విపులంగా తెలియజేయాలి. అవసరమైనపుడల్లా ప్రదర్శనలివ్వాలి.

ఇక స్త్రీలకొరకు నిర్వహింపబడే శిబిరాల విషయం. ఇక్కడ, శిక్షణ తల్లులుగాను, భార్యలుగాను, వారి కుటుంబం యొక్క ఆరోగ్యాన్ని, ఆనందాన్ని, సంతోషాన్ని, పెంపొం

దించుకోవడానికి అనుదినం చేయవలసిన అనేకపనులకు సంబంధించి ఉండాలి. (గృహనిర్వహణ, పాడుపు పిల్లలపెంపకం, శాకీరక, పారిశుద్ధ్యం, పరిసరాల పారిశుద్ధ్యం, ఆహారశాస్త్రం మొదలయిన విషయాలను వీరికి నేర్పాలి. ఈ కార్యక్రమంలో చేతిపనులు, కుటీరపరిశ్రమలు; కాయకూరల పెంపకం కోళ్ళ పెపకం, తేనె తయారుచేయడం మొదలయిన విషయాలుకూడా ఉండాలి.

శిక్షణ పరిసమాప్తమయిన తరువాత, శిక్షణ పొందిన వార్ల పేర్లను, గ్రామసేవకులకు, సాంఘిక విద్యా వ్యవస్థాపకులకు, విస్తరణోద్యోగులకు తెలియ జేయాలి. వీరు శిబిరానికివచ్చి, అక్కడే శిక్షణపొందుతున్న వారిపేర్లను తెలుసుకొని ఇకముందు సాముదాయక అభివృద్ధి కార్యక్రమాన్నమలు జేయుడంలో వారి సహాయం పొందవచ్చును. ఈవిధంగా శిక్షణ పొందిన నాయకులీ దిగువ కార్యక్రమాలను ప్రజాబాహుళ్యంలో ప్రచారం చేసేందుకు ఎటువంటి ఇబ్బంది ఉండకూడదు.

•

1. మొత్తం గ్రామాన్ని ప్రతి కొన్నిరోజులకు శుభ్రం చేయడం.

2. చెత్తను సరిగ్గా నిల్వచేయడం.

3. రోడ్లను బాగుచేయడం, వేయడం. ఆటస్థలాలను ఉద్యానవనాలను తయారుచేయడం.

4. సామాజిక ప్రయోజనార్థం నిర్వహింపబడే ఏ పనికీ అంగసంపద లోటుబడకుండా చూడడం.

5. ప్రతిగృహస్థుకూ, అతని కుటుంబంలో వారికి అనుదినం స్నానంచేయడంలోను, గుడ్డలు ఉతుక్కోవడంలోను, ఇంటిని శుభ్రంగా ఉంచుకోవడంలో కాయకూరలను పండించడంలోను, కోళ్ళను పెంచడంలోను శ్రద్ధకల్గ చేయడం.

6. ఎరువుగోతులను తవ్వేవిధానంలో రైతులకు శిక్షణ నివ్వడం.

7. విస్తరణోద్యోగుల సహాయంతో, వరిసాగులో జపాను పద్ధతివంటి నవీన విధానాలను రైతులకు ప్రదర్శనల ద్వారా తెలియజేయడం.

8. పాగరాని కుంపట్లను తాము వాడుతూ ఇతరులచేత కూడా వాటిని వాడించడం. తమకు తాము, నానుడు గోతులను మరుగు దొడ్లను నిర్మించుకోవడం.

9. హరిజన పేటలకు, ముటికిపేటలకు క్రమం తప్పకుండా వెళ్ళి, అక్కడి నివాసులను తమ వీధులను పరిశుభ్రంగా ఉంచుకోనేందుకు ప్రోత్సహించడం.

10. బడియీడు పిల్లలను బళ్ళకు పంపడంలోను, రోగాలు రాకుండా వారిని కాపాడటంలోను శ్రద్ధతీసుకోవడం వయోజన పాఠశాలలను నెలకొల్పి నిర్వహించడం.

11. పాలు పంచియిచ్చే కేంద్రాలు, యువజన సంఘాలు మహిళా సమాజాలు నెలకొల్పి నిర్వహించడం.

12. గ్రామీణ పరిశ్రమలను బాగుచేసి, కొనసాగించడంలో ప్రత్యేకశ్రద్ధ వహించడం.

13. హుండీలు పంచి, ఆదాచేయడాన్ని ప్రోత్సహించి పొదుపును వృద్ధిచేయడం.

14. గ్రామ ప్రజలుగాని, కార్యక్రమ సిబ్బందిగాని మొదలుపెట్టే ప్రతి అభివృద్ధి పథకంలోను శ్రద్ధ వహించడం.

---